# విశ్వమంతటా విస్తరించిన
# ప్రాచీన భారతీయ సంస్కృతి

రచన:

**శ్రీ శ్రీరామ్ సాఠే**

ముఖచిత్రం :

**కొంటికి యాత్రలో థోర్ వాడిన బల్సా బల్లకట్టు**

అనువాదం :

**శ్రీమతి గాడేపల్లి వెంకటరమణ**

*ప్రచురణ కర్తలు :*

**సాహిత్య నికేతన్**

భాగ్యనగర్ - 27

*ప్రతులకు :*

**సాహిత్యనికేతన్**
3-4-852, కేశవ నిలయం
బర్కత్‌పురా,
హైదరాబాద్-27 ఫోన్: 7563236

**సాహిత్యనికేతన్**
ఏలూరు రోడ్, గవర్నరు పేట,
విజయవాడ - 2

.వెల: రూ. 5/-

---

**ముద్రణ: ఆకృతి ఆఫ్‌సెట్** ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్ : 7664525

విశ్వమంతటా విస్తరించిన

# ప్రాచీన భారతీయ సంస్కృతి

మూలం
శ్రీ శ్రీరామ్ సాఠే

అనువాదం
శ్రీమతి గాడేపల్లి వెంకట రమణ

భారతీయ సంస్కృతి ప్రచార సమితి
భాగ్యనగర్

# ఉపయోగింపబడిన గ్రంథములు


1. భారతీయ సంస్కృతి కా విశ్వసంచార, డా. శరత్ హేబాళ్కర్.
అనువాదం - ప్రొఫెసర్ విద్యాధర సర్దేసాయ్
ప్రకాశకులు- సురుచి ప్రకాశన్ - ఝండేవాలా, న్యూఢిల్లీ - 110055.

2. ఇండియా మదర్ ఆఫ్ అజ్ అల్, ఎడిటర్ - చమన్లాల్
ప్రకాశకులు - భిక్షు చమన్లాల్, మోడరన్ స్కూల్, బారఖమా రోడ్, న్యూఢిల్లీ-1

3. యూనివర్సల్ కల్చర్, డా॥ కె.ఎమ్. ఘటాటే, సురేష్ మాపారి.
ప్రకాశకులు - మంత్రి, ఎ.హెచ్.పి. ఖరే టవున్, ధరమ్పేట, నాగపూర్.

4. ప్రాచీన ఆఫ్రో - హిందు జీవనదృష్టి, డా॥ సౌ. ఉషా గడకరి.
ఆఫ్రో హిందూ అధ్యయన కేంద్ర ● ప్రకాశన్, గోకుల్, ఘటాటే బంగ్లా, నాగపూర్.

5. కంచి మహాస్వామీస్ విజన్ ఆఫ్ ఏషియన్ కల్చర్ - డా॥ పద్మా సుబ్రహ్మణ్యం
ప్రకాశకులు - వనతి పతిప్పాకమ్, 13 దీనదయాళ స్ట్రీట్, టి.నగర్, చెన్నై-17

6. విశ్వమే రాష్ట్రీయతాకీ వికాసయాత్రా - శ్రీరామ్ సాఠే
ఇతిహాస సంకలన సమితి, 14/3 ఎల్.ఐ.జి.హెచ్, బర్కత్పుర, హైదరాబాద్-27

7. ఫ్యాక్ట్స్ ఎబౌట్ ఆర్యన్స్ - శ్రీరామ్ సాఠే
ఇతిహాస సంకలన సమితి, 14/3 ఎల్.ఐ.జి.హెచ్, బర్కత్పుర, హైదరాబాద్-27

8. మేప్-సర్వే ఆఫ్ ఇండియా బి.బ్లాక్.
హుడా కాంప్లెక్స్, తారనాక, హైదరాబాద్.

9. ఇండియా ఎబ్రాడ్, జనరల్ ఎడిటర్, డా॥ ఎస్.డి.కులక .
ప్రకాశకులు- భీష్మ,B 3/8 శ్రీపాల్ అపార్ట్మెంట్స్. పంచ పాఖడి - థానే-400602

# విజ్ఞప్తి

(ద్వితీయ ముద్రణ)

ప్రచురించిన ఇరవై రోజులలోనే "విశ్వమంతటా విస్తరించిన ప్రాచీన భారతీయ సంస్కృతి" అనే పేరుగల ఈ చిన్న పుస్తకం అన్ని ప్రతులు అమ్ముడు పోవటంతో ద్వితీయ ముద్రణ అవసరమైంది. ప్రాచీన భారతీయ సంస్కృతీ విశిష్టతను తెలుసు కోవాలని ఆధునిక భారతీయులు ఉత్సుకతను చూపించటం ఆహ్వానించదగిన విషయం. సంపదను దోచుకోవాలనే మనస్తత్వాన్ని పుణికి పుచ్చుకున్న పాశ్చాత్య సంస్కృతిని, వలస వాదానికి ప్రాతి నిధ్యం వహిస్తున్నందున అసహ్యించు కొంటున్నారు. అయితే భారతీయ సంస్కృత తద్భిన్నంగా శాంతి యుత సహజీవనాన్ని అందించింది. ఆ తరువాత కూడ భారతీయ సంస్కృతికి ప్రతినిధులుగా అనేక మంది విదేశాలకు వెళ్లారు. నిస్వార్థమైన ఆధ్యాత్మిక సాంస్కృతిక భావాలను తమ వెంట విదేశాలకు తీసుకువెళ్లి, అక్కడిప్రజలను పునీతులను చేశారు.

నౌకానిర్మాణ శా స్త్రం బాగా అభివృద్ధి చెందక పూర్వమే సముద్ర ప్రయాణాలు జరిగేవని శ్యామలా మణి అయ్యర్ 1998 జులై 25 నాటి 'హిందూ' పత్రికలో 'ది హైసీస్' అనే వ్యాసంలో వ్రాసారు. నార్వే దేశస్థుడైన థార్ హెయ్యర్ ధల్ కొన్ని దుంగలను కలిపికట్టుకుని దానిపై తుంగ చాపతో గుడిసెను కూడ ఏర్పాటు చేసుకున్నారు. దానిని ఆంగ్లంలో 'రాఫ్ట్' అంటారు. మనం బల్లకట్టు అనవచ్చు. ఆ బల్లకట్టు పై ఆయన సముద్రం మీద 4,300 మైళ్లు ప్రయాణించారు. ప్రాచీన భారతీయులు వివిధ దేశాలకు అలా ప్రయాణం చేసి ఉండవచ్చు. అటువంటి బల్లకట్టునే మీరు ముఖచిత్రంగా చూస్తున్నారు.

ప్రాచీన భారతీయ సంస్కృతి నలుదిక్కులా ఎలా వ్యాపించిందీ, విశ్వానికి

ప్రేరణదాయకమైన మార్గదర్శనాన్ని ఎలా అందించిందీ మనం తెలుసు కోవలసిన అవసరముంది. దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికామొదలైన ప్రాంతాలకు మన సంస్కృతి ఎలావ్యాపించిందీ మనం తెలుసుకోవాలి, మనవిద్యా విధానంలో పాశ్చాత్య సంస్కృతి వ్యాప్తి గురించి, మాత్రమే ఉండటం మన దురదృష్టం.

అయితే ఆలోటును తీర్చటానికా అన్నట్లు శ్రీ శ్రీరామ్ సాఠేగారు ఈ పుస్తకాన్ని రచించారు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ ప్రచారక్‌గా, ఒక సామాజిక కార్య కర్తగా ఆయన చాలా మందికి పరిచితులే. భారతీయ ఇతిహాస సంకలనా సమితి క్షేత్ర సంఘటనా కార్యదర్శిగా సంస్థను విస్తరించటానికి ప్రయత్నం చేస్తునే, చరిత్రను అధ్యయనం చేసి అనేక పుస్తకాలను వ్రాసారు. ముఖ్యంగా వివాదాస్పదమైన 'ఆర్యులు ఎక్కడి వారు' అనే సమస్యపై విశ్లేషణాత్మకంగా ఆయన సమకూర్చిన వివరణ అందరి మన్ననలను పొందింది. 'రాజ్యము - రాష్ట్రము - సంస్కృతి' 'కుటుంబ వ్యవస్థ అవసరమా?' 'భారతదేశం - విశ్వవైభవం' ఆయన వ్రాసిన యితర పుస్తకాలలో కొన్ని.

శ్రీమతి గాడేపల్లి వెంకట రమణ గారు హిందీలోని మూల గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. శ్రీ చిట్టా దామోదర శాస్త్రి గారు తమ అమూల్యమైన సలహాలను అందించారు.

వారందరికీ మా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

- ప్రకాశకులు.

బహుధాన్య శ్రావణ కృ - నవమి
భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సమారోహ
15-08-1998

**1998 మే 11,13 తేదీలలో భారతదేశం అణు పరీక్షలు జరిపింది** దాంతో ప్రపంచశాంతి భద్రతలకు ముప్పు కలిగిందంటూ ప్రపంచ అగ్రదేశాలు గగ్గోలు పెట్టాయి, ఆ అగ్రదేశాల దగ్గర అణ్వాయుధాలు లేవా ? అవి కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. అయినా ఇతరదదేశాల అణు పరీక్షలు శాంతివిఘాతాలని గొంతు చించుకొంటున్నాయి. ప్రపంచ శాంతి భద్రత ల పరిరక్షణ తమ బుజాలకెత్తుకొని పెత్తనం చెలాయిస్తున్నాయి.

ఐదువందల సంవత్సరాల క్రితం ఐరోపా సామ్రాజ్య విస్తరణ నాటి మానసిక స్థితిలోనే పాశ్చాత్యులు ఈనాటికీ పరిభ్రమిస్తున్నారు. నాలుగైదువందల సంవత్సరాల ప్రపంచ పర్యటన తరువాత బహు దేశాల సంస్కృతి సమాజ పరిస్థితులతో సంపర్కం ఏర్పడినా పాశ్చాత్యుల స్వార్థ ప్రవృత్తి మానవజాతి వినాశనం దిశగా కదుల్తోందని గ్రహించేవారి సంఖ్య నానాటికీ పెరుగుతోంది.

ఈ దిక్కుతోచని పరిస్థితి నుండి బయటపడే మార్గం కోసం అందరూ తపిస్తున్నారు. భారతీయ వ్యక్తిగత సామాజిక జీవనాలు శాంతి సౌభాగ్యాలకు ఆలవాలమని సామాజిక శాస్త్రవేత్తలు గుర్తించారు. పాశ్చాత్య జీవన విధానం వల్ల ఆకర్షితులైన భారతీయులుసైతం ఈ దుస్థితిని గ్రహించారు. ఏ మానవ ధర్మాన్ని పాటించి భారతీయులు సుఖశాంతులతో జీవనాన్ని సాగిస్తున్నారో ఏమానవ ధర్మ ప్రచారం ద్వారా ఇతరులకు సుఖశాంతుల నందించగలిగారో ఆ మానవ ధర్మ చరిత్ర అందరికీ అవశ్యపఠనీయం.

## విశ్వ వ్యాప్తమైన రెండు సంస్కృతులు

ఐరోపా అంతా వ్యాపించిన రోమను సామ్రాజ్యం కూలిపోయింది. ఆ తరువాత క్రీ.శ. 5 శతాబ్దంనుండి 15 వ శతాబ్దం వరకు గల ఐరోపా చరిత్రకాలాన్ని అంధకారయుగం అంటారు. ఆకాలంలో సమాజసంరక్షణ పరిపాలన వ్యవస్థ

నామమాత్రంగా కూడా ఉండేవి కావు. క్రీ.శ.15,16 శతాబ్దాలలో యూరోపియనులు సుఖశాంతులు లేని పరిస్థితి వల్ల విసిగి వేసారిపోయారు. వారు తమతమ వర్గాల స్వార్థం కోసం సుఖసంపదల నిమిత్తం ఐరోపాను వదలి అడ్డూ ఆపూలేకుండా ఖండాంతర ప్రయాణం సాగించారు. దీనినే వారు 'ఐరోపావిస్తరణ' అన్నారు. ఈ విస్తరణ పర్వంలో వారు అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలలో స్థానికులను అసంఖ్యాకంగా హతమా ్చి ఆదేశాలను ఆక్రమించారు, ఆవిధంగా ప్రపంచంలో ఐదింటిలో రెండు ఖండాలు విస్తరణ దారుల హస్తగతమైనాయి. ఈనాటికీ ఆ ఖండాలలో ఉన్న కొద్ది పాటి యూరోపియనులు అక్కడి ప్రకృతి సంపద నంతా ఉపయొగించుకొంటున్నారు. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోను వీరు చేసిన అఘాయిత్యాల మూలంగా అక్కడి వాళ్ళు వీళ్ళను అసహ్యించుకొన్నారు, అసహ్యించుకొంటున్నారు.

ఇటువంటి ఐరోపా విస్తరణకు అనేక వేల సంవత్సరాలకు ముందే భారతీయులు ప్రపంచ పర్యటన కావించగలిగారు, సుఖ శాంతులతో సంపదలతో తులతూగే భారతదేశం నుండి వారు యాత్ర సాగించారు. అయితే సంపదలకారణంగానే గత రెండు, రెండున్నర వేల సంవత్సరలుగా భారతదేశం మీద విదేశీ దురాక్రమణలు విచ్చలవిడిగా సాగాయి. ఇంతకు పూర్వం భారతదేశంలోని సుఖశాంతులు కారణంగానే ఇక్కడ అత్యున్నతమైన తత్త్వచింతన మొత్తం సమాజంలో వెల్లివిరిసింది. మన భారతదేశంలోని సుఖశాంతులను ప్రపంచంలోని అందరు మానవులకు అందించాలనే సంకల్పంతో భారతీయ తత్త్వవేత్తలు విద్యావేత్తలు ప్రపంచపర్యాటకులయ్యారు.

రెండువేల సంవత్సరాలకు పూర్వమే వీరు అమెరికా పశ్చిమ తీర ప్రాంతాలలో మెక్సికో పెరూదేశాలను ప్రవేశించి ఆదేశాల ప్రజలతో శాంతియుత సహజీవనం సాగించారు. అక్కడి వీరి సహజీవన ఫలితంగా 'ఇంకా' 'మయ' సంస్కృతులు ఐదారు వందల సంవత్సరాలకంటె ఎక్కువ కాలం ప్రాభవంలో ఉన్నాయి. కాని అమెరికా తూర్పుతీరాన చేరిన ఐరోపావాసులు నూరు నూట ఏభై

సంవత్సరాలలోనే సర్వనాశనం చేశారు. ఈ గ్రంధంలో అతి ప్రాచీన కాలంనుంచి కొనసాగిన భారతీయ సంస్కృతి గురించి కొద్దిగానైనా చెప్పాలని మా ప్రయత్నం.

ముందు ఐరోపా విస్తరణ గురించి విచారిద్దాం. ఇందులో మొదట క్రీ,శ.1486 లో 'డియాజ్' అనేవాడు గుడ్‌హోప్ అగ్రం చుట్టి వచ్చాడు. క్రీ.శ. 1492 లో కొలంబసు అమెరికాలో అడుగుపెట్టాడు. క్రీ.శ. 1498 లో వాస్కోడిగామా భారత్‌లో ప్రవేశించాడు, 16వ శతాబ్దంలో కెప్టెన్‌కుక్ ఆస్ట్రేలియా న్యూజిలాండ్‌లలో పర్యటించాడు. 19వ శతాబ్దంలో డేవిడ్‌లివింగ్ స్టన్ స్టాన్లీ, స్పెక్ అనే వారు ఆఫ్రికా చేరారు. ఈ విధంగా 400 సం॥లలో వారు ఐరోపా విస్తరణ గావించారు. ఇదినేటికి అతి సమీపకాలంలో జరిగింది. కాబట్టి వీటికి ఆధారాలు లభ్యం అవుతున్నాయి. కాని భారతీయుల విస్తరణ అతి ప్రాచీనం కాబట్టి వాటికి ఆధారాలు చూపించండం అంత సులభం కాదు. అయినా ఈ గ్రంధంలో అట్టి ఖచ్చితమైన ఆధారాలను వీలైనన్ని చూపే ప్రయత్నం చేస్తున్నాం.

భారతీయ చరిత్ర ఐరోపా దృష్టి కోణంతో పఠించే వారి అభిప్రాయం ప్రకారం భారతీయ సాహస బృందం భారతీయ సంస్కృతి ప్రతి నిదులుగా మొట్టమొదటిసారి క్రీ.పూ. 3వ శతాబ్దంలో ప్రపంచ పర్యటన సాగించింది. మౌర్య సమ్రాట్టు అశోకుడు బౌద్ధధర్మ ప్రచారార్థం ఒక బృందాన్ని పంపాడు. బౌద్ధాన్ని విశ్వవ్యాప్తం చేసే కృషిలో రెండవ బృందం శాతవాహనుల కాలంలోను, మూడవ బృందం గుప్తుల కాలంలోను, నాల్గవ బృందం పల్లవుల కాలంలోను భారతదేశంనుండి బైలుదేరినవి. ఈ విధంగా ఎందరో ప్రపంచం అంతా సుధీర్ఘకాలం పర్యటించారు. మన సంస్కృతిని వ్యాపింపచేశారు. 19వ, 20వ శతాబ్దాలలో కూడా స్వామి వివేకానందవంటి వారు విదేశాలకు వెళ్తూనే ఉన్నారు. భారతీయ సంస్కృతి వ్యాప్తికై భారతీయ సత్యాన్వేషకులు రెండువేల సంవత్సరాలుగా ప్రపంచ పర్యాటకులయ్యారనేది చారిత్రకసత్యం. ఇంతవరకు చెప్పింది ఐరోపాదృష్టి కోణంలో భారతీయులు సహితం పఠించే భారత చరిత్రకాలఖండవిషయాలు, కాని అంతకు పూర్వమే భారతీయ సంస్కృతి ప్రపంచమంతటా విస్తరించిన ఆధారాలున్నాయి. అశోకుని కాలం క్రీ.పూ.

3వ శతాబ్దిగా గుర్తించారు.

క్రీ.పూ. 2000 సం॥ నుండి క్రీ. శ. 1975 వరకు రూపుదిద్దుకొన్న రాజ్యాల పటాన్ని కెనడా నివాసి జాన్ బి. స్పార్క్స్ పండితుడు తయారు చేశాడు. దాని ప్రకారం క్రీ. పూ. 2000 నుంచి నేటి వరకు తైలధారలాగా అవిచ్ఛిన్నంగా నిలిచిన దేశాలు భారత్ చైనాలని గుర్తించారు. మా ఆలోచన ప్రకారం యూదుల దేశం ఇజ్రాయిలు కూడాప్రాచీనదేశాలలో ఒకటి. అతి పురాతన సంస్కృతులు గల దేశాలను సుమేరియా, ఏజియా, హిటాయిట్, మోరైట్, బాబిలోనియా, ఇరాను, ఈజిప్టు దేశాలు గా గుర్తించారు. హూణుల సంస్కృతి కూడా ఆనాటిదే.

ప్రస్తుతం మనం అశోకుని కంటే పూర్వం భారతీయ సంస్కృతి ఎక్కడెక్కడ వ్యాపించిందీ తెలుసుకొందాం. క్రీ.పూ. 2000 సం॥ నుండి అశోకుని కాలం వరకు గణుతికెక్కిన రాజ్యాలలో అస్సీరియా, ఫోనీషియా, గ్రీసు, రోములుకూడా ఉన్నాయి. వీటన్నిటినీ పాశ్చాత్య చారిత్రకారులు ప్రాచీన నాగరిక దేశాలుగా గు__ంచారు. ఆ ప్రాచీనదేశాలలో కొన్నింటిలో భారతీయ సంస్కృతి వ్యాపించిన వైనం పరిశీలిద్దాం.

## ప్రాచీన నాగరికతలు

**సుమేరియా :** క్రీ.పూ. 2300 నుండి క్రీ.పూ. 2150 వరకు అనగా 150 సం॥లు సుమేరియా సంస్కృతి వర్ధల్లింది. ఈ సంస్కృతి క్రీ.పూ. 2000 పూర్వమే నశించింది. అటువంటి దేశంలో కూడా భారతీయ సంస్కృతి వ్యాపించింది. భారతీయులవలెనే సుమేరియనులు కూడా 12 నెలల సంవత్సరాన్ని పాటించారు. ఈ నెలలన్నీ చాంద్రమాన ప్రకారం గణించినవే. ప్రస్తుతం మనదేశంలో నడుస్తున్న విధంగా ప్రతిమూడు సంవత్సరాలకు ఒక అధికమాసం ఏర్పడుతుంది. ఇది భారతీయపంచాంగ పద్ధతిలోదే, అష్టమి, పూర్ణిమలను వారు భారతీయులవలె అత్యంతోత్సాహంతో జరుపుకొనేవారు. దేవతలకోసం దేవదాసీల ఆచారాన్ని వాళ్లు పాటించేవారు.


ప్రాచీన నాగరికతలు
రోమ్
గ్రీస్
కశ్యప్
హూణ
ఇరాన్
చైనా
ఈజిప్టు
భారత్
1 అసిరీయా
2 బాబిలోనియా
3 సుమేరియా
3
2
1

ఇరాన్ : స్పార్ఫ్ పండితుని ప్రకారం ఇరానీయుల సంస్కృతికాలం క్రీ.పూ. 2000 నుండి క్రీ.పూ 250 వరకు 1750 సం. ఇరానీయుల సంస్కృతివైదికమని భావిస్తారు. ఇరాన్ ఇస్లాం ప్రభావంలోకి వచ్చే సరికి అక్కడి పారశీ ప్రజలు ఆదేశాన్ని వదిలేశారు. ఇప్పటికీ పారశీ సంస్కృతిలో వేద సంప్రదాయాలు గోచరిస్తాయి. వీరు అగ్నిపూజ చేస్తారు. పాలు, నేయి, ధాన్యం మొ॥ పదార్థాలను ఆహుతి చేస్తారు. వీరి పవిత్రగ్రంథం 'ఝుంద్ అవెస్త' అతి పురాతన గ్రంథం. ఇందులోని ప్రార్థనలలో ఋగ్వేదమంత్ర భావాలు కనిపిస్తాయి. ఇరాను భాషాపదాలకు సంస్కృతపదాలతో సారూప్యం స్పష్టంగా కనిపిస్తుంది. ఉదా : సరస్వతీ వారి భాషలో హర హరవతే. మనగాథ వారి గాథ. యజ్ఞంలో సోమలత సోమరస ప్రస్తావన ఉంది గదా! ఆ సోమ వారి ఆహోమగా రూపాంతరం చెందింది. ఇంకా విశేషమేమంటే సూర్యునికి పర్యాయపదంగా మిత్ర శబ్దం వాడుకలో ఉండేది. జనులు సూర్యుని ఉపాసించేవారు.

బాబిలోనియా : క్రీ.పూ. 2000 నుండి క్రీ.పూ. 400 వరకు (1600 సం॥). బాబిలోనియా ప్రజల దేవతల సంఖ్య 60 వేలు, వీరు ఉదయం సాయంత్రం పూజలు నిర్వహిస్తారు. అందులో అర్ఘ్య పాద్యాలు, ధూపదీపనైవేద్యాలు ఉంటాయి. ఇది భారతీయ పద్ధతేకదా! క్రీ. పూ. 1760 ప్రాంతపు 'కసాయిట్' రాజులపేర్లు సూర్య, అగ్ని, మరుత్ మొ॥ భారతీయ దేవతల పేర్లతో సంబంధించినవే. రాజులసంధి పత్రాల లో సాక్షులుగా ఇంద్రుడు వరుణుడు మొ॥ పేర్లు కనిపిస్తాయి. ఇది కాక భారతీయ వైద్యులైన చరక సుశ్రుతుల వైద్య విధానాలు 'అల అపరాన' శిలా లేఖనాలలో దర్శనమిస్తాయి. ఇవన్నీ భారతీయ సంస్కృతి ప్రాశస్త్యం స్పష్టం చేస్తున్నాయి. ఈ వైద్య విధానాలు భారతీయమైనవే గదా!.

ఈజిప్టు : దీనిని మిశ్రదేశం అంటారు. ఈ దేశనాగరికత క్రీ.పూ. 2000 నుండి క్రీ.పూ. 150 వరకు (1850 సం॥లు) ఉండేది. వీరి నాగరికత లో సూర్యుడు ఆరోగ్య అధిదేవతగా పూజలందుకొంటున్నాడు. భారతీయులు ''ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'' అని భావిస్తారు గదా! భారతదేశం నుంచి వీరు అనేక ఔషధాలను

దిగుమతి చేసుకొనేవారు. ఇక్కడి భాషాపదాలకు మన పదాలకు స్పష్టమైన పోలికలున్నాయి. ఈశ్వర - ఈసిక్, శివ - సేవ, శ్వేత - సేత, క్షత్రియ - ఖేత, మిత్ర - మిశ్ర, శరత్ - శరడ.

క్రీ.పూ. 1370 నాటి ఇక్కడి చక్రవర్తి పేరు ఏఖనాథోన. ఇతడు దేవుడొక్కడే అని ప్రచారం చేసేవాడు. సర్వజగతికి సర్వేశరుడొక్కడే అని నమ్మేవాడు. భారతీయులు కూడా ఇట్లే భావిస్తారు.

'ఏకోదేవో, సర్వభూతేషు గూఢ, సర్వవ్యాపి, సర్వ భూతాన్తరాత్మ,
కర్మాధ్యక్షః, సర్వభూతాదివాసః, సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ'

అని మన భావన.

ఈ దేశంలోని ప్రసిద్ధమైన నిర్మాణాలు పిరమిడ్లు. ఇవి రాజుల శవాలను భద్రపరచడానికి నిర్మింపబడిన సమాధులు. రామాయణంలో దశరథుడు చనిపోయాడు. భరతుడు ఎంతో దూరాన ఉన్న మేనమామల రాజ్యం కేకయ దేశానికి వెళ్లి తిరిగిరాలేదు. అతడు వచ్చేవరకు దశరథుని శరీరం భద్రపరచినట్లు వర్ణించారు. భారతీయులు సాధారణంగా దేహానికి ప్రాధన్యత నివ్వలేదు. మరణానంతరం అగ్నికి ఆహుతి చేసేవారు. ఇది దేహానికి దేశానికి ఎంతో మేలు చేసే ఆచారం.

**అస్సీరియా :** క్రీ.పూ. 1450 నుండి క్రీ.పూ. 500 వరకు (950 సం॥లు) ఈ దేశంలో అధర్వణ వేదం ప్రాచుర్యంలో ఉంది. అధర్వణవేదంలో పాటింపబడే ఆచారాలు వ్యవహారాలు అస్సీరియా దేశంలో ఉన్నాయి. చికిత్సావిధానాలు, హోమం, యజ్ఞం, వశీకరణ మంత్రాలు భూతవిద్య మొ॥ అక్కడ ప్రచారంలో ఉండేవి. ఇవన్నీ 'చరకసంహిత' లోనివి. ఈ విధంగా అస్సీరియాలో భారతీయ సంస్కృతి వ్యాపించినట్లు స్పష్టం అవుతుంది.

**గ్రీసు :** క్రీ.పూ. 1450 నుండి క్రీ.పూ. 150 వరకు (1300 సం॥లు) . యునానీ

వైద్యంపై భారతీయ ప్రభావం ప్రత్యక్షంగా ఉంది. ఈజిప్టు ఇరానుల ద్వారా పరోక్షంగా కూడా ఉంది. డోరోథియా ఛాంపోలీనా అంచనాప్రకారం భారతీయ ఆయుర్వేదంలోని శరీర విజ్ఞానశాస్త్రంలో ఏవిదేశీపదం కనిపించదు. కాని పాశ్చాత్య శారీరక విజ్ఞాన శాస్త్రంలో భారతీయపదాలు గోచరిస్తాయి. శిరస్సులోని మెదడుపై భాగాన్ని ఆయుర్వేదంలో శిరోబ్రహ్మం అంటారు. లాటిన్‌లో ఇది ''సెరెబ్రం'' అయింది. మెదడు వెనుకభాగం ''శిరోవిలోమం'' ఇది లాటిన్‌లో సెరెబెల్లమ్‌గా మారింది. హృద్ - హార్ట్ అయింది. భారతీయ వైద్యాధిదేవతలు కవలలు. వీరు అశ్వినీ దేవతలు. యునానీలో వైద్యాధిదేవతలు కేక్టస్ పోలుప్సులు కవలలు అశ్వారూఢులై రాజులను కాపాడుతారని ప్రతీతి. డా. రాయల్ ''సివిలిజేషన్ ఇన్ ఇండియా'' అనే పుస్తకంలో (2వ భాగం పుట 249) ''ప్రపంచంలోనే మొదటి చికిత్సావిధానం గురించి తెలియజేసిన భారతీయులకు మనం ఋణపడి ఉన్నాం'' అని వ్రాశారు.

ప్రసిద్ధ చరిత్రకారుడు ''మోనియర్ విలియమ్సు'' యూరోపులోనే ప్రథమ దార్శనికులైన ప్లేటో, పైథాగరసులు తత్వజ్ఞానపరంగా భారతీయులకు కృతజ్ఞులై ఉండాలని వ్రాశారు. పైథాగరస్ సిద్ధాంతంగా నేడు చెలామణీ అవుతున్న సిద్ధాంతం పైథాగరస్ కంటె ముందుగానే బోధాయన శుల్బసూత్రంగా భారతదేశంలో స్థిరీకరింపబడింది. భారతీయులు విద్యార్జన దశలో బ్రహ్మచర్యం పాటించేవారు. దీనిని బ్రహ్మచర్యాశ్రమం అంటారు. ఈ వ్యవస్థ పైథాగరస్‌ను ఆకర్షించింది. ఆయన తన శిష్యగణానికి ఈ బ్రహ్మచర్య నియమం ఏర్పరచాడు. ఈయన కర్మసిద్ధాంతాన్ని నమ్మేవారు. ఈయన వలెనే ''ఎంపిడోక్లీస్'' కూడా కర్మ సిద్ధాంతంలో భాగమైన పునర్జన్మను నమ్మేవారు.

**రోమ్ :** క్రీ.పూ 800 నుండి క్రీ.శ 500 వరకు (1300సం) ఐరోపాలోని అన్నిదేశాల మీద రోమ్ నాగరికతా ప్రభావం కనిపిస్తుంది. కాని రోమ్‌కు పునాది గ్రీకు నాగరికత. రోమను నాగరికతపై భారతీయ సంస్కృతి ప్రభావం

తెలుసుకోవడానికి ఒక్క ఉదాహరణ చాలు. రోమన్ సంస్కృతిలోని ప్రజలు ఆరాధించే దేవత ''ముద్రస్కన'' ఆ దేవత యొక్క ఆయుధం ''తితియ'' మన ఇంద్రుని వజ్రాయుధ వర్ణనకు సరిపోలుతుంది.

**హూణులు – మధ్య ఆసియా :** క్రీ.పూ. 2000 నుండి క్రీ.శ. 700 వరకు (2700 సం) భారతదేశం నుంచి మధ్యాసియాకు పోవాలంటే మధ్య ఆఫ్ఘనిస్థానం ఉంది. ఆఫ్ఘనిస్థానం ఒకప్పుడు భారతేశంలో భాగం. అప్పుడు దాని పేరు గాంధారదేశం. ఇదంతా వేయి సంవత్సరాల నాటిమాట. అశోకుని కంటె పూర్వకాలంలో జగత్ప్రసిద్ధమైన ''తక్షశిల'' పట్టి విద్యాలయం కాదు. విశ్వవిద్యాలయం. అది గాంధారంలోనే ఉండేది. గ్రీకులు, రోమనులు, ఈజిప్షియనులు ఈ తక్షశిల విశ్వవిద్యాలయానికి అనుసంధించి ఉండేవారు. రెండున్నర మూడువేల సంవత్సరాల క్రితం ప్రపంచం మొత్తం మీద ఏకైక అత్యంత ఆధునిక జ్ఞానపీఠంగా తక్షశిల విలసిల్లింది. ఇక్కడి గురువులు ''సంస్కృతం'' ''అర్ధమాగధి'', ''పాలి'' మొ॥ భాషలలో విద్యాబోధన చేసేవారు. తక్షశిలా స్నాతకులకు రాజ్య సభలన్నింటా పెద్దపీట వేసేవారు.

భారతదేశం నుంచి చైనా, మధ్య ఆసియా ప్రాంతాలకు చేరే భూమార్గం ''పట్టుమార్గం''గా ప్రసిద్ధిపొందింది. ఈ మార్గంగుండా ప్రయాణించే వ్యాపారులలో చాలామంది పట్టు వ్యాపారులు కావడమే దానికి కారణం. పట్టు మార్గమంతా అత్యున్నత పర్వతాలు, కీకారణ్యాలతో దుర్గమంగా ఉండేది. అయినా మార్గమంతా యాత్రికులతో వ్యాపారులతో కిటకిటలాడేది. ఈ మార్గంలోని అనేక రాజ్యాలలో భారతీయులు రాజులుగా ఉండేవారు. ఖోతాన్‌దేశరాజు విజిత కీర్తుడు, కాశగర రాజధానిగా ఉన్న దేశంపేరు ''శైలరాజదేశం''. కాశగర రాజ్యానికి ఉత్తరాన కూచాదేశం ఉంది. దానిని హర పుష్ప, స్వర్ణపుష్ప హరదేవులు పాలించారు. కూచదేశానికి ఉత్తరాన ఉన్నదేశం ''అగ్నిదేశం'' ఆ దేశపు రాజుల పేర్లు ఇంద్రార్జున, చంద్రార్జున మొ॥వి. అశోకుని కంటె ఒకటిన్నరవేల సంవత్సరాలకు ముందున్న

రాజ్యాలు అశోకుని కాలంలో ప్రపంచయాత్ర చేసిన బౌద్ధభిక్షువులకు కూడా ఉపయోగ పడ్డాయి. పైన చెప్పిన నాలుగు నగరాలు ప్రస్తుతం చైనాలోని సికియాంగ్ ప్రాంతంలో ఉన్నాయి. ఇక్కడ కూడా భారతదేశంలోని వారిలాగే జైన, వైష్ణవ, బౌద్ధమతాల వారంతా శాంతియుత సహజీవనం సాగించేవారు. పట్టుమార్గం త్రవ్వకాలలో భారతీయ సంస్కృతి ఛాయలు అశోకుని కంటె పూర్వమే అక్కడ ఉన్నట్లు ఆధారాలు లభించాయి. అక్కడి బౌద్ధ విహారం పూర్తి జీర్ణావస్థలో ఉంది. దీనిలో బుద్ధ, విష్ణు, శివ, సరస్వతి మూర్తులు లభించాయి.

**కశ్యప :** మధ్యాసియాలోని కాస్పియన్ సముద్రం ప్రస్తుతం రష్యాలో ఉంది. ఈ సముద్రం తూర్పుతీరంలో **2000** సం॥ల క్రితం కశ్యప సంస్కృతి విలసిల్లింది. రష్యావారి త్రవ్వకాలంలో ''హరప్పా'' సంస్కృతికి సమానమైన చక్కని నాగరికత శాస్త్రబద్ధమైన కట్టడాలు కలిగిన నగరం బయట పడింది. ఆ శాస్త్రజ్ఞులు ఇవి హరప్పా సంస్కృతికి సంబంధించినవని నిర్ధారించారు.

**చైనా :** అశోకుని కంటె ముందు కాలంలో చైనాతో మనకు గల సంబంధాలను పరిశీలిద్దాం. భారతీయ సాంఖ్యావాదంలో ప్రకృతి పురుష తత్వాలవర్ణన ఉంది. అదేవిధంగా చైనాలో ''లావోత్సే'' (క్రీ.పూ. **604**) తమ సంస్కృతిలో సృష్టికి మూలాధారమైన ''తావో''లో యాంగ్, చింగ్ అనే రెండు తత్వాల గురించి పేర్కొన్నారు. యాంగ్ అనునది వెలుగుకు, పురుషత్వానికి, క్రియాశీలతకు చిహ్నం. చింగ్ అనేది చీకటి. జడత్వం, ప్రకృతితత్వానికి నిలయం. ఈ చరాచర సృష్టి అనవతరం కొనసాగటానికి ఈ రెండింటి ఆవశ్యకత ఉంది. సృష్టి ప్రవాహానికి ప్రకృతి పురుషుల రెంటి అవసరం ఉందని భారతీయుల విశ్వాసం. అంతేకాకుండా మానవునకు పరమాత్మకు గల సంబంధాలు, వ్యక్తికి కుటుంబానికి వంశానికి గల సంబంధాలపై చైనాలో కూడా భారతీయుల ఆలోచన సరళి కనబడుతుంది.

భారతదేశ సంస్కృతి, ఇతరదేశములతో పోల్చిచూసే పాశ్చాత్య విద్వాంసులు ప్రత్యేకించి యూరపీయులు ఆయా దేశాల సంస్కృతి నుంచి భారతదేశం అనేక

విషయాలను తమ సంస్కృతిలో కలుపుకొందని నిరాధార ఆరోపణలు చేస్తున్నారు. వేదాలు ప్రపంచంలో అతి పురాతనమైన సాహిత్యంగా పరిగణింపబడుతున్నాయి. ఈ విషయం సాధికారంగా నిరూపించబడింది. అటువంటి సాహిత్యం, మానసిక పరిపక్వత అసామాన్య విద్వత్తు నుంచి మాత్రమే వెలువడగలదు. అంత పురాతనమైన కాలంలో ఇంత వికాసం చెందిన ఏ ఇతర దేశము కలదనుటకు ఆధారములు లేవు.

అలా అని భారతదేశం పూర్వకాలంలో ఏ ఇతరదేశం నుంచి విజ్ఞానం స్వీకరించలేదని అనటం లేదు. ఎవరి నుంచి విషయం గ్రహించినా భారతీయులు వారికి సర్వదా కృతజ్ఞులై ఉన్నారు. ఐదువేల సం॥కు పూర్వమే భారతీయులు ఖగోళశాస్త్రంలో ఎంతో ప్రావీణ్యం సంపాదించారు. కాని క్రీ.శ. 2వ శతాబ్దంలో గ్రీకు విద్వాంసుడు (యవనుడు) ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని యవన జాతక సిద్ధాంతంగా నేటికీ దానిని గుర్తిస్తారు. ఆయుర్వేదంలో కూడ భారతీయులు సిద్ధహస్తులు. వారు అనేక విదేశీ విద్వాంసులతో చర్చాగోష్ఠులు జరుపుతూ ఉండేవారు. పునర్వసు – ఆత్రేయ అధ్యక్షతలో అటువంటి చర్చాగోష్ఠి జరిగినట్లు లేఖనాలు లభించాయి. చైనానుంచి పంగళాక్షుడనేవైద్యుడు బాల్హిక దేశపు (బ్రైక్ట్రియా) కాకాయనుడు ఈ గోష్ఠిలో పాల్గొన్నారు. కాకాయనుడు తయారు చేసిన ఔషధం నేటికీ కాకయన మాత్ర గా ఆయుర్వేదంలో సిద్ధిపొందింది.

భారతీయులు ఏ విజ్ఞానాన్ని కృతజ్ఞతతో స్వీకరించారో వారి పేరుతోనే దాన్ని వ్యాప్తి చేసారు. ఏ విజ్ఞాన విషయానికైనా విదేశీ పేరుకనుక లేకపోతే అది భారతీయులు సొంత విజ్ఞాన సంపద. ప్రాచీన కాలంలో వెలుగొందిన అనేక విశ్వ విద్యాలయాల ద్వారా భారతీయులు తమ జ్ఞాన సంపదను పంచేవారు. నేటికీ పంచుతూనే ఉన్నారు.

ఆంగ్లేయుల బానిసత్వం నుండి విముక్తి చెంది 50 సం॥ ఐనా భారతీయ విద్యాలయాలలో ఇప్పటికీ ఆంగ్లేయులు వ్రాసిన చరిత్ర కాలగణనం విద్యార్థులకు పాఠ్యాంశంగా ఉంది. ఆంగ్లేయుల దృష్టికోణంతో వ్రాసిన భారతీయ చరిత్ర

కారణంగా భారతీయ సంస్కృతిపై అవగాహన లేని అనేకమంది విద్వాంసులు తయారవుతున్నారు. కాని ఇప్పటి కొత్త అన్వేషణల కారణంగా వీరిలో కూడా ఆ చరిత్రకాలగణనపై అవిశ్వాసం తలెత్తింది. పైన తెలిపిన అనేక ఆధారాల కారణంగా అశోకుని కంటె ముందుకాలంలోనే అనేకమంది భారతీయసంస్కృతి ప్రచారకులు ప్రపంచదేశాలు పర్యటించారని స్పష్టం అవుతోంది. మన దేశంలో వేల సంవత్సరాలనుంచి వ్యక్తినుంచి వ్యక్తికి స్వీయ ఉదాహరణగా సంస్కారం అందించే ఆచారం మతకులాతీతంగా నిరంతరం కొనసాగుతూ వస్తున్నది. క్రీస్తు పూర్వం పరిఢవిల్లిన రాజ్యాలను పరిశీలిస్తే వాటిలో ప్రాచుర్యం పొందిన భారతీయ సంస్కృతి ప్రాచీనత మనకు అర్థం అవుతుంది. అయితే మన ఈ సంస్కృతి ప్రపంచమంతా ఎలా ఎప్పుడు విస్తరించిందో మనం తెలుసుకొందాం.

# తూర్పు ఆసియా

ముందు ఆసియాలోని అన్ని ఇతర దేశాలలో ఈ సంస్కృతి ఎలా విస్తరించింది తెలుసుకొందాం.

**కంపూచియా :** (కంబోడియా) సముద్రతీరమైన కంబోడియా 2000 సం. కు పూర్వం దట్టమైన అరణ్యాలతో నిండి ఉండేది. ప్రశాంత జీవనం గడిపే ఇక్కడి నాగా ప్రజలు ఒకరోజున ఒక పెద్ద నౌకనుండి శస్త్రధారులైన జనులు తీరం జేరటం చూశారు. విషయం తెలిసిన రాణి సోమ ప్రత్యర్థులను ఎదుర్కోటానికి రంగం సిద్ధం చేసింది. కాని అప్పుడు వారికొక అసాధారణ అనుభవం ఎదురైంది. నౌకలోనుంచి దిగినవారు నాగజాతి ప్రజలను దోచుకొనేందుకు రాలేదు. వారిని బానిసలనుగా మార్చటానికీ రాలేదు. వారి దేశాన్ని ఆక్రమించుకోవడానికీ రాలేదు. ఇది తెలిసిన నాగజాతి ప్రజలు ఆశ్చర్యచకితులయ్యారు. ఆ నౌకాధిపతి భారతదేశ శైలరాజు కౌండిన్యుడు. కొద్దికాలంలోనే వీరిమధ్య మైత్రీ భావం పెంపొందింది. కౌండిన్యుడు

రాణిసోమను పరిణయ మాడాడు. ఈ చరిత్రకు రెండు ఆధారాలున్నాయి. మొదటిది కంబోడియా దేశంలో అనేక ప్రాంతాలలో లభ్యమైన శిలాశాసనాలు, రెండవది భద్రపరచబడిన చైనా చరిత్ర. చైనా చరిత్ర ప్రకారం కౌండిన్యుని రాజ్యంపేరు ఫూనాన్. కౌండిన్యుడి తరువాత అనేకమంది సాహస భారతీయ వీరులు కంబోడియా చేరారు. స్థానికులతో వివాహాది సంబంధాలు నెలకొల్పారు. వీరిద్వారా భారతీయ సంస్కృతి, సంస్కృతభాష కంబోడియాలో వ్యాపించాయి. కౌండిన్యుడు స్థాపించిన ఫూనాన్ సామ్రాజ్యం 600 సం. విలసిల్లింది. క్రీ.శ. 600 సం.లో స్థానిక కంబూ వంశస్థుల రాజ్య స్థాపన జరిగింది. ఇది దాదాపు 800 సం. కొనసాగింది. ఈ రెండు వంశాల రాజులపేర్లలో భారతీయత స్పష్టంగా కినిపిస్తుంది. ఉదా. జయవర్మన్, గుణవర్మన్, భవవర్మన్, ఇంద్రసేన మొదలగునవి 5000 సం॥ పూర్వం హరప్పా సంస్కృతిలో కన్పించిన స్నానపు గదుల్ని పోలినవి ఇక్కడి త్రవ్వకాలలో బయటపడ్డాయి. అంతేకాక ఇక్కడ లభించిన సంస్కృత లేఖనాల ద్వారా, వారు ఆనాటి సంస్కృత కావ్యాలు శాస్త్రాలు అధ్యయనం చేశారని తెలుస్తుంది. రాజు శైవమతస్థుడైనా వైష్ణవం, బౌద్ధం, బాగా ప్రచారం లో ఉండేవి. అక్కడ మహదేవుడు, విష్ణువు, బుద్ధుడు, అవలోకితేశ్వరుడు మొ॥ దేవతల ఆలయాలు నిర్మింపబడ్డాయి. మందిరాలలో రామయణం, భారతం మొదలైన గ్రంథాలపై ప్రసంగాలు సాగేవి. అవి మొత్తం సమాజంపై ప్రభావం చూపేవి. రామరాజ్యం స్థాపింపబడాలనే ఆదర్శం ప్రతి రాజులోను ఉండేది.

గురుశిష్య పరంపరాగతమైన భారతీయ విద్యావ్యవస్థ ఇక్కడ వెలుగొందింది. జనజీవన శైలిలో నాలుగు ఆశ్రమాలు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాలు పాటించారు. కర్మ సిద్ధాంతం, పునర్జన్మ అవతారభావనలు, నాలుగు యుగాలు, నిర్గుణోపాసన, సగుణోపాసనలు మొ. భారతీయ తత్త్వచింతనలు అక్కడి ప్రజలలో జీర్ణించుకున్నాయి.

కంబూజ రాజవంశావళిలోని చక్రవర్తులందరూ భవన నిర్మాణాలలో శిల్పకళాభిమాన మక్కువ కలిగి ఉండేవారు. 12వ శతాబ్దపు కంబూజ రాజు

సూర్యవర్మన్ నిర్మించిన విష్ణుమందిరం అంగకోరవటుగా ప్రసిద్ధి గాంచింది. అది ఈ నాటికీ వాస్తు శిల్పకళా నైపుణ్యాలకు ప్రతీకగా నిలిచింది. మందిరపు గోడలమీద, వరండాలలోను ద్వారముఖాలలోను, స్తంభాలపైన భారతీయ చరిత్ర శిలా లిఖితమైంది.

## థాయ్‌లాండ్ - సయామ్

**థాయిలాండ్ సయామ్ :** థాయిలాండుకు జాతీయ గ్రంథం రామాయణం. సాహిత్యకారులు ప్రీతిగా వర్ణించే పక్షి హంస. రాజులందరి పేర్ల చివర రామ శబ్దం విధిగా ఉంటుంది. దేశంలో పాటించేది బౌద్ధం. సయాం దేశం కొంతకాలం కంబూజ రాజ్యంలో భాగంగా ఉండేది. అందుచేత వైదిక ప్రభావం ఈ దేశంమీద స్పష్టంగా కనబడుతుంది. ఇక్కడి త్రవ్వకాలలో బయలుపడిన శిథిలాలలో భారతదేశంలో కనిపించే అన్నిరకాల బుద్ధ ప్రతిమలు, మందిరాలు దర్శనమిచ్చాయి. ఇక్కడి భాషలో సంస్కృత ప్రభావం కనబడుతుంది. దక్షిణ చైనాలోని నానచావో అనే ప్రాంతపు ప్రాచీన నామం గాంధారం ఇంకో విశేషమేమంటే ఇక్కడ ఒక రాజ్యంపేరు విదేహ, దాని రాజధాని మిథిల. ఇక్కడి వరకు కంబూజ సామ్రాజ్యం వ్యాపించి ఉండేది. 13వ శతాబ్దంలో చైనాలోని మొఘల్ చక్రవర్తి కుబలయిఖాన్ గాంధార దేశంపై దండెత్తినపుడు సయామీ ప్రజలు అస్సాం, బ్రహ్మదేశం వలస వెళ్లారు. అక్కడ నుండి నేటి థాయిలాండు చేరారు. వారి మొదటి రాజు రాజ్యాభిషేకం సమయంలో ఇంద్రాదిత్యుడు అనేపేరు పెట్టుకొన్నాడు. క్రీ.శ. 1782లో ప్రస్తుత రాజవంశపు మొదటిరాజు రాజ్యాభిషేక సమయంలో తనపేరు చివర 'రామప్రథమ' అని చేర్చుకొన్నాడు. మరొక విశేషమేమంటే అక్కడి కాలగణనలో బుద్ధ నిర్వాణ శకం, శాలివాహన శకం ఈ రెండూ పాటిస్తారు. రాజులు ప్రజాహితం లక్ష్యంగా దక్షులై పాలించేవారు.

**లావోస్ :** లావోస్ ప్రజల అధిష్ఠానదేవత పేరు భద్రేశ్వరుడు. ఇక్కడ దొరికిన శిలా శాసనాల ప్రకారం మొట్టమొదటి రాజు పేరు శత్రువర్మ. అతని కొడుకు

శ్రేష్ఠవర్మన్. ఇతని రాజధాని శ్రేష్ఠపురం. ఇది నేడు శిథిలాలుగా మిగిలింది. ఇక్కడి లింగ పర్వతంమీద భద్రేశ్వర మందిరాన్ని క్రీ.శ. 60వ శతాబ్దంనాటిదిగా గుర్తించారు. అక్కడ బౌద్ధ విహారాలు కూడా ఉన్నాయి. శిథిలావస్థలో ఉన్న పద్మాసన లక్ష్మీమూర్తి ఒక విహారంలో లభించింది. ఇంకా ఎన్నో శివలింగాలు, బుద్ధ విగ్రహాలు ఇక్కడ లభించాయి. చాలా వరకు శాలివాహన శకం ఇక్కడ అమలులో ఉంది. అక్కడక్కడ బుద్ధ నిర్వాణ శకంకూడా అమలులో ఉంది. ఇంకొక విశేషం ఏమంటే ఇక్కడ రాజభాష సంస్కృతం. మతప్రచారంలో పాలీ భాష ఉపయోగపడేది. ఇప్పటికీ వారి భాషా పదాలలో సంస్కృత పదాలు గోచరిస్తాయి. వారి సాహిత్యంలో సంస్కృత గ్రంథాల భావనా సరళి కనిపిస్తుంది. భారతీయుల సంస్కృతికి లావోస్ ప్రజల సంస్కృతికి మూలాధారాలు ఒక్కటే. లావోస్ సంస్కృతి ప్రత్యేకంగా కనిపించినా భారత లావోస్ సంస్కృతులు తల్లి పిల్లల వలె ఉంటాయి. రాజ్యం చుట్టూ బలమైన రాజ్యాలు నాలుగు ఉన్నా తనదైన సంస్కృతిని పదిలపరుచుకొన్న విశిష్టమైన చిన్నరాజ్యం లావోస్.

**వియత్నాం** : ఇది ప్రాచీన కాలంలో చంపారాజ్యంగా పిలువబడేది. దీనిలో ముఖ్యప్రాంతాలు నాలుగు. వీటి ప్రాచీన నామాలు అమరావతి విజయ కోథర పాండురంగలు. నేడివి క్వాంగ్‌నావు భిన్నదిన్న నీత్రాంగ్ ఫాన్‌రంగ్ గా పిలువబడుతున్నాయి. క్రీ.శ. 3వ శతాబ్దం వరకు ఇది కంబూజ రాజ్యంలో భాగంగా ఉండేది. ఆ విధంగా ఇక్కడ భారతీయ సంస్కృతి వ్యాపించింది. క్రీ.శ. 5వ శతాబ్దంలో భద్రవర్మన్ అనేరాజు పాలించిన ఆధారాలున్నాయి. భద్రవర్మన్ వేదకాలంనాటి దేవతలకు ఇతరదేవతలకు మందిరాలు నిర్మించాడు. క్రీ.శ. 6వ శతాబ్ద కాలంలో రుద్ర వర్మన్ రాజు స్వయంగా తన్ను బ్రహ్మ క్షత్రియుడుగా ప్రకటించుకొన్నాడు. క్రీ.శ. 10వ శతాబ్దంలో హరివర్మన్ తాను మహాయాన బౌద్ధమతాన్ని పాటిస్తున్నప్పటికి భగవతీ దేవికి భవ్యమందిరం నిర్మించాడు. రాజు ప్రజలు సర్వదేవతలను సమానంగా గౌరవించేవారు. రాజమందిరంలోని పూజా గృహాలలో శైవ వైష్ణవ బౌద్ధ విగ్రహాలు ఉండేవి. అనేక ఆక్రమాల ధాటికి తట్టుకొని

నిలబడ్డ రాజ్యం చంప. చైనా మొఘలు రాజు కుబలయిఖాన్ కూడా చంపరాజ్యంతో తలపడి ఓడిపోయాడు. ఈ రాజులు 1000 - 1200 సం. పాలించారు. వీరు భారతీయ సంస్కృతికి పోషకులు. వీరు ప్రజావిద్రోహులు కారు. తాము ప్రజలచే ప్రజల సుఖశాంతుల కోసం నియమించబడిన ధర్మకర్తలం అని భావించేవారు. చంపా దేశంలో దర్శనమిచ్చే శిథిలాలు భారతీయ సంస్కృతి వ్యాప్తికి సాక్షులుగా నిలిచి ఉన్నాయి.

**బ్రహ్మదేశం బర్మా** :- దీని ప్రాచీన నామం అపరాంతం. ఈ దేశంలో విష్ణుమందిర శిథిలాలు కన్పించాయి. ఈ మందిరానికి క్రీ.శ. 13వ శతాబ్దిలో జీర్ణోద్ధరణ జరిగినట్లు ఇక్కడ లభించిన శిలాశాసనంవల్ల తెలుస్తున్నది. ఈ మందిర పరిసరాలలో సూర్యభగవానుడు, దశావతారాల విగ్రహాలు లభించాయి. దక్షిణ బ్రహ్మదేశ రాజధాని శ్రీక్షేత్రం. సుసంపన్నము వైభవోపేతమూ ఐనదంటూ చైనా యాత్రికులు హ్యూయాన్ త్సాంగ్, ఈత్సింగ్‌లు వర్ణించారు. బ్రహ్మదేశపు ప్రాచీననామం అపరాంత భారతీయతను చాటుతుంది. అప్పటిరాజు అనవ్రతుడు. ఇతడు హీనయాన బౌద్ధ మతావలంబకుడు. ఈయన కాలంలో మనుస్మృతి ఆధారంగా ''ధమ్మవిలాసం'' అనే గ్రంథం రచింపబడింది. నారద స్మృతి ఆధారంగా ''మహారాజ ధర్మధన్ '' అనే గ్రంథాన్ని కైఝూ రచించాడు. ఆనాటి చక్రవర్తి కైఝూను ''మనురాజు'' అనే బిరుదుతో సత్కరించాడు. బౌద్ధమత పూజా ప్రక్రియ వైదిక విధానాలను అనుసరించి ఉంది.

## ఆగ్నేయ ఆసియా

మలయా, సుమత్రా, జావా, బాలి బోర్నియా, ఫిలిప్పిన్‌లో మొదటి అయిదు దేశాలలో మూడువేల ద్వీపాలున్నాయి. ఇవన్నీ ప్రస్తుతం ఇండోనేషియా, మలేషియా రాజ్యాలలో భాగాలే. భారతీయులకు ఇవన్నీ దగ్గర ప్రాంతాలు, చైనాయాత్రికుడు ఈత్సింగ్ క్రీ.శ. 447లో జావా వెళ్తూ భారతదేశం దర్శించాడట.

కాలంలో శైలేంద్ర రాజు వైభోవోపేతంగా పాలించేవాడనీ భారత్ నుంచి ఈ ద్వీపాలకు నిరంతరం రాకపోకలు జరిగేవని ఈత్సింగ్ వ్రాశాడు.

**మలయా:** నేడు మలయ దేశంలో క్రైస్తవుల, ముస్లిముల, ప్రభావం ఎక్కువగా ఉంది. కాని వారిలో భారతీయ సంస్కృతి ఛాయలు కనిపిస్తాయి. వారి భాషలో అనేక సంస్కృత పదాలున్నాయి.

ఈ దేశం 21 గనులతో నిండి ఉంది. గని త్రవ్వకాలలో పురావస్తు త్రవ్వకాలలో ఎన్నోబుద్ధ విగ్రహాలు బయలుపడ్డాయి. బౌద్ధ సంప్రదాయంలోని తాంత్రిక పూజా సామాగ్రి, శిలాశాసనాలు, లోహశాసనాలు ఇక్కడ లభించాయి. మహా నావికుడయిన బుద్ధ గుప్తుని వర్ణనలు ఈ శిలా లేఖనాలలో కన్పిస్తాయి. శైలేంద్రరాజు 'బోరోబుదూర్' అనే ఆధ్యాత్మిక స్మారక స్థూపం నిర్మించాడు. ఇందులో తొమ్మిది అంతస్తులున్నాయి. చిట్ట చివరి అంతస్తులోని గుండ్రటి మెట్ల వ్యాసం 90 అడుగులు. ఇక్కడి శిలలపై బౌద్ధ మహాకావ్యం చెక్కబడింది. భారతదేశంలో ఇంతపెద్ద స్థూపం లేదు.

**జావా :** జావా ద్వీపంలో ప్రంబనన పర్వతశ్రేణులలో 156 మందిరాలున్నాయి. ఒక శివాలయంలో ప్రదక్షిణ మార్గం 7 అడుగుల వెడల్పు ఉంది. ఆ ప్రదక్షిణ మార్గపు గోడల మీద రామాయణ గాథ వ్రాయబడి ఉంది. క్రీ.శ. 10వ శతాబ్దంలో బాలితుంగ చక్రవర్తి అగస్త్య మందిరం నిర్మించాడు. అక్కడ అగస్త్య పర్వం అను పేరుగల గ్రంథం లభ్యమైంది. వీటివల్ల ఆ కాలంలోని అగస్త్యప్రభావం అవగత మవుతుంది.

**బోర్నియో :** బోర్నియా దేశం గురించి ఈత్సింగు అనేచైనా యాత్రికుని రచనల ద్వారా మనకు తెలుస్తున్నాది. ఆ రచనల ప్రకారం బోర్నియో సంస్కృతి కంబూజ సంస్కృతికి సమానమైంది. భారతీయులతో వీరికి 5వ శతాబ్దం నుండి ప్రత్యక్ష సంబంధాలున్నాయి. కుతయ, మోరకమన్ ప్రాంతాలలో దొరకిన శిలాఫలకాలలో

పరాక్రమవంతుడైన మూలవర్మరాజు యుధిష్ఠిర బిరుదాంకితుడని వర్ణింపబడింది. ఇతడు ''ఫూనాన్'' సామ్రాజ్యాధిపతి కౌండిన్యుని పౌత్రుడుగా గుర్తింపపడ్డారు. ఇక్కడ శైవమతం ప్రాచుర్యంలో ఉన్నది. కెంబెంగ్ ప్రాంత గుహలలో దొరికిన శివుడు, నందీశ్వరుడు, మహాకాళి అగస్త్యుడు మొ॥ విగ్రహాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. అనేక ప్రదేశాలలో బుద్ధ విగ్రహాలు ఎన్నో బయల్పడ్డాయి.

**ఫిలిప్పీన్స్ :** ఇది 7000 ద్వీపాల సమూహం, ఇవి ఒక లక్షా పదిహేనువేల చ.మై. వ్యాపించి ఉన్నాయి. మధ్య ఫిలిప్పిన్సు లోని సెబ్రూ లో లోకేశ్వరుని కాంస్య విగ్రహం, గరుడుని స్వర్ణ విగ్రహం లభించాయి. దక్షిణ ప్రాంతమైన లుఝున లో అవలోకితేశ్వరుని విగ్రహం లభించింది. ఫూనాన్ రాజ్యంతోనూ, శైలేంద్ర రాజు తోనూ ఈ ద్వీపవాసులకు సత్సంబంధాలుండేవి. ఇప్పటికీ ఫిలిప్పిన్సు రాజధాని మనీలాలో పార్లమెంటు అధ్యక్ష పీఠం వెనకాల మనువు చిత్రపటం ఉంది. మనువు ప్రసిద్ధ స్మృతికర్త. ఆ పటం క్రింద ''ప్రథమ స్మృతికర్త మనువు'' అని వ్రాసి ఉంది. మలయానుండి ఫిలిప్పీన్సు వరకుగల మొత్తం ప్రాంతం లో భారతీయ సంస్కృతి ప్రచారకులు 1500 2000 సం॥ పూర్వమే ప్రవేశించారు. నేటికి వారి జీవనశైలిలో భారతీయ సంస్కృతి చిహ్నాలు కనిపిస్తాయి.

## ఈశాన్య మరియు పశ్చిమ ఆసియాలు

**టిబెట్టు :** టిబెట్టు ప్రజలంతా దలైలామాను జాతిపితగా ధర్మాధ్యక్షునిగా పూజిస్తారు. విద్య, ధర్మం, సాహిత్యం, కళలు మొ॥, క్షేత్రాలలో భారతదేశం మార్గదర్శకంగా నిలిచిందని భారత దేశ సంస్కృతినుంచి మూల ధర్మ సూత్రాలను టిబెట్టు ప్రజలు స్వీకరించారని పదునాల్గవ దలైలామా పేర్కొన్నారు.

క్రీ. శ. 7వ శతాబ్దికి చెందిన నరదేవ మహారాజు పరాక్రమవంతుడుగా పేరుగాంచాడు. ఈయన నేపాలు, చైనా దేశపు రాజకుమార్తెలను పెళ్ళి చేసుకొన్నారు. వీరిద్వారా రాజుకు బౌద్ధమత సాంగత్యమేర్పడింది. నరదేవ మహారాజు ప్రోత్సాహంతో

సంఘోత అనే పండితుడు భారతదేశం దర్శించాడు. ఆ తరువాత కాలం లో ఈ పండితుడు నరదేవుని గురువుగా భాసించాడు. తరువాత టిబెట్టులో అనేక విహారాలు నిర్మింపబడ్డాయి. క్రీ. శ. 8వ శతాబ్ది చివరలో శాంత రక్షితుడు, పద్మ సంభవుడు అనే ఇద్దరు బౌద్ధ ప్రచారకులు భారతదేశం నుంచి టిబెట్టును సందర్శించారు. రాజు వీరిని సగౌరవంగా ఆహ్వానించాడు. రాజధాని నగరమైన లాసాలో ఈ బౌద్ధప్రచారకుల ఆధ్వర్యంలో విద్యాలయాలు, గ్రంథాలయాలు ఏర్పడ్డాయి. ఎన్నో భారతీయ గ్రంథాలు భారతదేశంలో నాశనం చేయబడ్డాయి. అటువంటి గ్రంథాలు అనువాదరూపంలో మనకు టిబెట్టులో లభ్యమౌతాయి. ఏదైనా ఒక విషయం చర్చకు వచ్చి ఏది ధర్మం ఏది కాదు అని చెప్పవలసివచ్చినప్పుడు టిబెట్టు పండితులు భారతీయ గ్రంథాలను ప్రమాణంగా స్వీకరిస్తారు. క్రీ.శ. 14వ శతాబ్దంలో బస్తోన అనే చరిత్రకారుడు టిబెట్టు వాఙ్మయంమొత్తాన్ని సంకలనంగావించాడు.

చైనా : చైనాలోని కలగన ప్రాంతం నుంచి బీజింగు వెళ్లేమార్గంలో ఒక శాసనం దొరికింది. విశేషమేమంటే ఆ శాసనం అయిదు భాషలలో వ్రాయబడింది. ఆ శాసనం లో 'దేవానాంప్రియ అశోక చక్రవర్తి బుద్ధుని జ్ఞాపకార్థం పెద్ద పెద్ద స్థూపాలను, విహారాలను నిర్మించాడు. ఈ సత్సంస్కృతి వెలుగులు ప్రపంచమంతా వ్యాపించాయి. దాదాపు 2,200 సం॥ పూర్వం పాటలీపుత్రుంలో అశోక సమ్రాట్ ఒక బౌద్ధ పరిషత్తు నిర్వహించాడు. బౌద్ధ పరిషత్తుల ప్రభావం వల్ల వందలమంది బౌద్ధ ప్రచారానికి బైలుదేరారు. ఈ ప్రచారకులు కష్టతరమైన హిమాలయ పర్వత శ్రేణులను అధిగమించి చైనా చేరారు. వీరు నాలుగుమార్గాల లో చైనా చేరారు. మొదటిది కాశ్మీరులోని గిల్‌గిత్ ప్రాంతం, రెండవది బ్రహ్మదేశం మీదుగా సాగింది. మూడవది పట్టు మార్గం. నాల్గవది సముద్రమార్గం. అతివిశాలమైన చైనాను అన్నిమార్గాల గుండా భారతీయ ప్రచారకులు చేరారు. వారు స్వయంగా జ్ఞానోదయంపొందారు. మానవాళికి జ్ఞానోదయంకలిగించాలని బయలుదేరిన ఈ భారత యువకుల సాత్విక శక్తిముందు మహారాజుల రాక్షస రాజ్యవిస్తరణ కాంక్ష తలవంచింది. రాజ్యాలపై పట్టు సాధించాలన్నే కరడు గట్టిన అహంభావం కరిగిపోయింది. ప్రపంచంలో జ్ఞాన

జ్యోతులు వెలిగాయి. చైనా లోని కన్‌ఫ్యూషియస్ మతావంబకులు తాము ఎప్పుడు ఎలా బౌద్ధులుగా మారిపోయారో గమనించలేక పోయారు. క్రీ. శ 1వ శతాబ్దంలో ఆది ప్రచారకులైన కశ్యపమాతంగుడు, ధర్మరక్షకుడు చైనా చేరారు. క్రీ.శ. 3వ శతాబ్దంలో లోయాంగ్ లో శ్వేతాశ్వ విహారంలో నలందా విద్యాలయాన్ని పోలిన విద్యాలయం ప్రారంభమైంది. పాహియాన్ అనే చైనా యాత్రికుడు క్రీ.శ. 5వ శతాబ్దంలో భారతదేశం నుండి చైనాకు తిరిగి వెళ్తున్నప్పుడు బుద్ధ భద్రుని నేతృత్వంలో అనేక మంది ప్రచారకులు చైనా వెళ్లారు. ఆ ప్రచారకులు ఎలాంటివారు? వారు సామ్రాజ్యాలను స్థాపించగలరు, నడపగలరు. వారంతటి ధీశాలులే కాదు. సరస్వతీ కృపా పాత్రులైన మహా పండితులు కూడా. అటువంటి వేలమంది భారతీయ ప్రచారకులు మానవ కల్యాణానికై తమ జీవితాలను అంకితం చేశారు. ఈ విధంగా వేయి సం॥ ల పాటు నిరంతరం సాగిన భారతీయ ప్రచారక మహాప్రవాహం ప్రపంచ చరిత్రలో అద్భుతఘటనగా పేర్కొనతగినది. ఈ కాలంలో చైనా ప్రజలు బౌద్ధాన్ని మాత్రమే అవలంబించారు అనలేము. వారిలో ఆత్మ, పరమాత్మ, జీవుడు కర్మ మొదలయిన ఆలోచనలు కలగటానికి భారతీయతత్వశాస్త్ర ప్రభావమే కారణం అనాలి. వారంతా భారతదేశం వైపు ఆకర్షితులైయ్యారు. భారతీయ విద్యాపీఠాలలో అత్యున్నత శిక్షణ పొందటమే తమ లక్ష్యంగా భావించేవారు. ఇప్పటికీ చైనా వారి జీవితాలలో భారతీయసంస్కృతి ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. మావోత్సే తుంగ్ తమతండ్రి బౌద్ధమతం పాటించేవారని తెలిపాడు. ప్రాచీన సంస్కృతి విలువలు ఇక్కడ దొరికే వేల బౌద్ధశిలా ప్రతిమలలో నిక్షిప్తమై ఇప్పటికీ దర్శనమిస్తున్నాయి. ప్రస్తుత ఆలోచనా పద్ధతులలో కొంత మార్పువచ్చినప్పటికీ ప్రాచీన సంస్కృతి విలువలు కనిపిస్తాయి. S-00



చైనా టిబెట్టు దేశాలలో భారతీయ సంస్కృతి ధృఢంగా నాటుకొంది. ఈ ప్రాంతాల నుంచి కూడా భిక్షువులు అనేక ప్రదేశాలలో సంస్కృతి ప్రచారం చేశారు.



**కొరియా :** క్రీ.శ. 4వ శతాబ్దంలో చైనా బౌద్ధ భిక్షువుల ద్వారా కొరియా

జపానులలో బౌద్ధమతం ప్రవేశించింది. కొరియా లోని మూడు రాజ్యాలలో బౌద్ధానికి రాజాశ్రయం లభించింది. కొరియా బౌద్ధ భిక్షువులు తమ దేశం పరాక్రమణకు గురి అయినప్పుడు శస్త్రధారణ చేసి మాతృభూమిని కాపాడారు. మాతృభూమి రక్షణార్థం భిక్షువులు పోరాడటం ఇక్కడి ప్రత్యేకత.

**జపాన్ :** జపానుదేశం 4000 ద్వీపాల సమూహం. వారి మతం పేరు షింతో, చైనా కొరియాల కంటె అతి ఎక్కువ సంఖ్యలో బుద్ధ విగ్రహాలు దొరికాయి. క్రీ.శ. 5 వ శతాబ్దంనుంచి బౌద్ధం ఇక్కడ వ్యాపించసాగింది. కర్రలతో విహారాలు బుద్ధ మందిరాలు నిర్మించారు. షింతో బౌద్ధ సంప్రదాయాల మేలు కలయికయే జపాను సంస్కృతి. భారతీయ సంస్కృతి విశిష్టత ఏమిటి ? భారతీయ సంస్కృతి ఎక్కడ ప్రవేశించినా అక్కడి స్థానిక సంస్కృతిని నాశనంచేయులేదు. జపాను వారి నిర్మాణకౌశలం, చిత్రకళలు విభిన్నమైనవే అయినా అందులో భారతీయ సంస్కృతి ఛాయలు కనిపిస్తాయి. అంతేకాదు సంస్కృత భాషాప్రభావం, రామాయణ భారత కథల ప్రభావం జపాను వారి మీద ఉన్నాయి.

**అరేబియా :** రాజు ఖలీఫా-అల్-మన్సూర్. ఇతని మంత్రి ఖలీదా. ఇతడు బౌద్ధ భిక్షువు కొడుకు. క్రీ.శ. 705 లో అతన్ని మహ్మదీయునిగా మార్చారు. అతని కొడుకు, మనుమడు క్రీ.శ. 786 నుంచి క్రీ.శ. 805 వరకు ఖలీఫాల మంత్రులుగా ఉన్నారు. వీరు భారతీయ వైద్యవిజ్ఞానం, గణితశాస్త్రం, ఖగోళశాస్త్రం మొదలగు వానిని అరబ్ స్థానం చేర్చారు. పంచతంత్ర కథలు మొదట అరబీ, సిరియా భాషలలోనికి తరువాత లాటిన్, స్పెయిన్, ఇటలీ భాషలలోనికి అనువదింపబడినాయి. ఏ.ఏ. మాక్డోనాల్ ''క్రీ.శ. 8,9 శతాబ్దాలలో భారతీయులు అంకెలు గణితము మొ॥ శాస్త్రాలను అరబ్బులకు నేర్పారు. వీరినుంచి ఐరోపావాసులు నేరుకొన్నారు. అందుకనే అంకెలను అరబ్ సంఖ్యలని పిలుస్తారు, కాని వాటి ప్రారంభస్థానం భారతదేశం'' అని వ్రాశాడు.

మనం ఇప్పటి వరకు భారతీయ సంస్కృతి అత్యధికంగా వ్యాపించిన ఆసియా

ఖండం గురించి తెలుకొన్నాం. భారతీయ సంస్కృతి కనిపించని ప్రాంతం ఆసియా ఖండంలోనే లేదు. ప్రపంచంలోని ఇతర ఖండాలలో జరిగిన భారతీయ వ్యాప్తిగురించి ఇప్పుడు తెలుసుకొందాం.

## ఆ ఫికా

**ఈజిప్టు :** ఇది ఆఫ్రికాలోని దేశము. దీని ప్రాచీన నామం మిశ్రదేశం. ఈ దేశంలో విస్తరించిన భారతీయ సంస్కృతి గురించి ముందు పుటలలో తెలుసుకొన్నాం. ఆఫ్రికా ఖండం మొత్తంలో భారతీయ సంస్కృతి ప్రచారం ఎలా జరిగిందో పరిశీలిద్దాం.



బాబిలోనియానుంచి గ్రీసు వరకు వ్యాపారార్థం ప్రయాణించే భారతీయులు భూమార్గం ద్వారా గత 4వేల సం॥లుగా ఆఫ్రికా చేరుతూనే ఉన్నారు. అలాగే 2 1/2 వేల మైళ్ల దూరం సముద్రం మీదుగా ప్రయాణించి ఆఫ్రికా చేరేవారు. వారిలో చాలా మంది ధర్మప్రచారకులు. ఎంతో మంది గణిత శాస్త్రజ్ఞులు, అనేక మంది విద్వాంసులు. వీరంతా భారతీయ సంస్కృతితో ఆఫ్రికా చేరి స్థిరపడ్డారు. దక్షిణ రోడిషియాలో కన్పించిన అవశేషాలు భారతీయ సంస్కృతి ఛాయలను పట్టి ఇస్తున్నాయి. అక్కడి పర్వత శ్రేణులలో భారతీయ శైలితో గుహలు కన్పిస్తాయి.

మిశ్ర దేశంలోని జీవనాధారమైనది నీల.(Nile). ఈ పేరు సంస్కృత శబ్దం అని పాశ్చాత్య విశ్లేషకుల అభిప్రాయం. ప్రాచీన భారతీయుల భౌగోళిక పరిజ్ఞాన పరిశీలకుడు కల్నల్ విల్ ఫోర్డ్ ఆలోచన ప్రకారం భారతీయ పురాణాలలో వర్ణింపబడిన శంఖ ద్వీపం ఆఫ్రికా. దీని ఆకారం శంఖ రూపంలో ఉంది. నీలనది భారతీయ పురాణాలలో అమరసరోవరం లేదా దేవసరోవరంలో పుట్టింది అని ఉంది అని ఏషియాటిక్ రీసెర్చి వాల్యూమ్ 3 వ సంపుటంలో విల్‌ఫోర్డు ఉటంకించాడు. సరోవర పరిసర ప్రాంతం పేరు చంద్రస్థానం. ఈ సరోవరం చంద్ర పర్వతం మీద ఉందని, నీలనది శంఖాబ్ది (మద్యధరా సముద్రం) లో లీన మవుతుందని ఆ సంపుటంలో ఉంది. తూర్పుఆఫ్రికా, ఈజిప్టుల భౌగోళిక చిత్రపటాలను విల్‌ఫోర్డ్ తయారు చేశారు. ఈ చిత్రపటాల ఆధారంగాను, విల్‌ఫోర్డ్ చేసిన రచనల ఆధారంగాను జాన్ కానింగ్ స్పెక్ నీలనది ఉద్భవస్థానాన్ని కనుగొన్నానని చెప్పాడు. అమర సరోవరపు నేటి వ్యవహార నామం విక్టోరియా సరోవరం.

ఆఫ్రికా లోని 300 తండాల గురించి ప్రొఫెసరు బీటీ(Biti) కూలంకషంగా అధ్యయనం చేశాడు. ఆయన ఆలోచనల ప్రకారం ఆఫ్రికలను భావాలు ఈశ్వరుడు, జన్మ మృత్యువులు, సమాజంలో స్త్రీ యొక్క స్థానం మొ॥ విషయాలలో భావపరంగానూ వ్యవహారికంగానూ భారతీయ పద్ధతులను పోలి ఉన్నాయని తన గ్రంథం "రెలిజియస్ ట్రెడిషన్సు అండ్ ఫిలాసఫీ ఆఫ్ ఆఫ్రికన్స్" (ఆఫ్రికనుల

మతం, సంప్రదాయాలు వేదాంతం' అనే గ్రంథంలో వ్రాశాడు. జన్మ మృత్యువులను సమానంగా చూచే ఆఫ్రికనులు మృత్యువుకు భయ పడరు. జీవన విధానంలో స్త్రీకి ఎంతో ప్రాముఖ్యతనిస్తారు. ఆమెను జన్మమృత్యువుల వారధిగా భావిస్తారు. సృష్టిలోని మూలతత్వమైన సృజనాత్మక శక్తి స్త్రీలో ఉందని భావిస్తారు. వారి ఆలోచన సంపూర్ణ మానవాళి గురించి మానవ జీవితం గురించి సాగుతుంది. వారు ప్రతి వ్యక్తి యొక్క సంస్కారం గురించి ప్రాముఖ్యం ఇస్తారు. జాతి లేక మత పద్ధతులను మార్చాలనే ఉద్దేశం వీరికి లేదు. ఈ విధంగా వీరు సంస్కృతిపరంగా, ఆలోచనా సరళిపరంగా భారతీయులవలె కనిపిస్తారు.

## ఐరోపా

ఇంతవరకు మనం ఆసియాలోను ఆఫ్రికాలోను గల భారతీయ సంస్కృతి ఛాయలు గమనించాం. ఐరోపాదేశాలలో భారతీయ సంస్కృతి విస్తరణ ఎలా సాగిందో పరిశీలిద్దాం. అశోకునకు పూర్వకాలపు దేశాల గురించి చర్చించే సమయంలో గ్రీసు, రోము, కశ్యప (కాస్పియన్) ప్రదేశాల గురించి చెప్పుకున్నాం. వీరి సంస్కృతి ఈ నాటికి చాలా మారిపోయింది. కాని ఇప్పటికీ మారనిది సైబీరియా లోనే. ఇక్కడ ఇప్పటికీ భారతీయ సాహిత్యం, తత్వజ్ఞానం మొ॥ విషయాలలో అధ్యయనం, అధ్యాపనం వ్యవహారం జరుగుతున్నాయి.

**సైబీరియా** : మొట్టమొదట రష్యావారు క్రీ.శ. 17వ శతాబ్దంలో సైబీరియాలో ప్రవేశించారు. కాని భారతీయ ప్రచారకులు వేలాది సం॥ పూర్వమే చైనా మంగోలియాల గుండా సైబీరియా ప్రవేశించారు. అక్కడ బైకాల్ సరస్సు ప్రాంతంలో ఇప్పటికీ 33 విహారాలలో కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు. ఒక లక్షా 35 వేల చ.మై. విస్తీర్ణంలో ఈ విహారాలు వ్యాపించి ఉన్నాయి. అతి ప్రాచీన కాలం నుంచి ఇక్కడ ఇంద్రాగ్నులకు అర్చనలు జరుగుతున్నాయి. ఈ పూజా కార్యక్రమంలో భారతదేశపు గంగాజలానికి ఎంతో ప్రాముఖ్యం ఇస్తారు. స్థానిక నదులలోని నీటిని సేకరించి వాటిలో మంత్రపూర్వకంగా గంగా దేవి ప్రతిమను ప్రతిష్ఠ చేస్తారు. నేటికీ

బుద్ధ పూజా కార్యక్రమంలో ఈ విధంగా అభిమంత్రించిన జలాన్ని వినియోగిస్తారు. ఇక్కడి గ్రంథాలయాలలో అనేక ప్రాచీన భారతీయ గ్రంథాలు లభ్యం అవుతాయి. చోంగోల్ విహార అధిష్ఠాన దేవత మహాకాలుడు. సెలెంగ్ విహారంలో మైత్రేయుని ప్రతిమ ఉంది. అగినకి విహారంలో సరస్వతీదేవి చిత్రపటం ఉంది. విద్యాదేవిని ఉపాసించే ఈ భారతీయ సంప్రదాయం అప్రతిహతంగా ఇక్కడ పాటించబడుతోంది. ఒకప్పుడు నలంద వంటి విశ్వవిద్యాలయం ఇక్కడ కూడా స్థాపించబడింది. పాణిని అష్టాధ్యాయి, కాళిదాసుని మేఘదూతం మొ॥ గ్రంథాలను ఇక్కడ అధ్యయనం చేసేవారు. సైబీరియాలోని కావ్యాలలో రామాయణ గాథలు కన్పిస్తాయి. వీరి సంప్రదాయంలో భారతీయుల అతిథి మర్యాదలు వినయశీలత గోచరిస్తాయి.

విశ్వంలోని 5 ఖండాలలో ఇంతవరకు మనం మూడు ఖండాలలో భారతీయ సంస్కృతి విస్తరణ గురించి పరిశీలించాం. ఇప్పుడు అమెరికా ఆస్ట్రేలియాలలో జరిగిన వ్యాప్తిని గురించి తెలుసుకొందాం. ఈ రెండు ఖండాలను ఐరోపావాసులు కొద్ది కాలంలోనే పూర్తిగా ఆక్రమించుకొన్నారు. క్రీ.శ. 1492 లో కొలంబసు మొదటి సారి అమెరికా చేరాడు. కెప్టెన్ కుక్ 17 వ శతాబ్దంలో ఆస్ట్రేలియా ప్రవేశించాడు. ఈ రెండు ఖండాలలోను స్థానికుల సంఖ్యాబలం చాలా తక్కువ. ధనకాంక్ష, ఆధిపత్య కాంక్షలతో యూరోపియన్లు స్థానికులను అనేకుల్ని చంపేశారు. చాలామందిని క్రైస్తవులు గా మార్చారు. ఐరోపా సభ్యత వారి ఆలోచనా సరళి స్థానికులపై రుద్దారు. ఐరోపావారు తమ సంఖ్యా బలం పెరిగాక ఈ ఖండాలలో శాశ్వతనివాసం ఏర్పరచుకొని ఆదేశం తమదేశమే అని ప్రకటించుకొన్నారు. అమెరికా ఆస్ట్రేలియాలు ఐరోపా వారికి స్వాధీనం కాక పూర్వం అక్కడ నివసించిన స్థానికులలో గల భారతీయ సంస్కృతి ప్రభావాన్ని పరిశీలిద్దాం.

## అమెరికా

అమెరికాలోని మెక్సికో దేశ ప్రాచీన నామం మయ. మయ దేశ ప్రజలు గొప్ప శిల్పులు, భవన నిర్మాణ వేత్తలు, కళాకారులు, అత్యంత ప్రతిభావంతులుగా



బేరింగ్ జలసంధి
సైబీరియా
అలస్కా
యూరోప్
బైకల్
సరస్సు
కెనడా
ఉత్తర అమెరికా
మెక్సికో
గ్వాటిమల
పసిఫిక్
ఆఫ్రికా
భారత్
దక్షిణ
అమెరికా
పెరు
పోలినేషియా
ఆస్ట్రేలియా
బొలివియా

గుర్తింపబడేవారు. అనేక ప్రాంతాలలో జరిగిన పురావస్తు త్రవ్వకాలలో నగరాలు శాస్త్రబద్ధమైన కట్టడాలతో బయలు పడ్డాయి. ఇవి భారత దేశపు హరప్పా నగర నిర్మాణాలతో సరిపోలుతున్నాయి. అవశేషాలలో మందిర నిర్మాణాలు కనిపించాయి. శిలలలో భారతీయ చిహ్నాలైన స్వస్తిక్, కమలం మొ॥ చెక్కబడినాయి. యక్షునా, కోబా అనునవి ప్రాచీన నగరాలుగా గుర్తింపబడ్డాయి. ఈ రెండు నగరాలను కలిపే రహదారి ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది. దీని పొడవు 65 మైళ్లు.

మయదేశ వాసుల కాలగమనం క్రీ.పూ. 499 నుంచి ప్రారంభమైంది. భారతీయులు కనుగొన్న సున్నా గురించి వీరికి తెలుసు. వీరి విద్యావిధానం భారతీయుల గురుశిష్య సంబంధాన్ని పోలిఉంది. గురువుల ఆజ్ఞలను పాటిస్తూ నియమనిష్ఠలతో శిష్యులు మెలగేవారు. మందిరాలు విద్యా కేంద్రాలుగా ఉండేవి. భారతీయ సంస్కృతి వ్యాప్తికి సాక్షిగా అనేక అవశేషాలు ఇక్కడ లభించాయి. అలాగే ఇప్పటి ప్రజల ఆచార వ్యవహారాలను గమనిస్తే భారతీయ సంస్కృతి ప్రభావం ఎంత ఎక్కువగా ఉందో మనకు ద్యోకతమవుతుంది. మెక్సికనులు స్త్రీలకు అత్యంత గౌరవ స్థానం ఇస్తారు. వివాహం అనేది జీవితంలో ఒక సంస్కారంగా భారతీయులలాగానే వీరు భావిస్తారు. కాంట్రాక్టు వివాహ విధానం వీరికి లేదు. అంత గౌరవ మర్యాదలతోను సమాజంలో స్త్రీలు వ్యవహరిస్తారు. సమాజంలో స్త్రీని గౌరవించే ఆచారం ఉంది.

**పెరూ, బొలీవియా, గ్వాటేమాలా ఇంకా :** మెక్సికోలోని మయ సంస్కృతిలాగా దక్షిణ అమెరికాలోని పెరూ బొలీవియా, గ్వాటేమాలా దేశాలలో ''ఇంకా'' సంస్కృతి పరిఢవిల్లింది. ఈ దేశాలలోని వారుకూడా భవన నిర్మాణాలలో కుశలురు. పురావస్తు త్రవ్వకాలలో చిలీదేశం వరకువీరు నిర్మించిన రహదారి బయల్పడింది. ఉత్తరదక్షిణ అమెరికాలను కలుపుతూ ఉన్న భూభాగంలోని హోండు రస్ ప్రాంతంలో ఏనుగుపై అధిరోహించిన రాజు ప్రతిమ ఇంద్రుని పోలి ఉంది. దీనితో పాటుగ త్రిమూర్తులు, ఆదిశేషుడు, నరసింహుడు,

విఘ్నేశ్వరుడు, విష్ణువు మొ॥ దేవతా మూర్తులు లభించాయి. వర్షాకాల ప్రారంభంలో చేసే పర్వత (గోవర్ధన) పూజ ఇప్పటికీ అక్కడ అమలులో ఉంది. ఇంకా భాషలో వందలాది సంస్కృత పదాలున్నాయి. చతుర్యుగ సిద్ధాంతం వారు నమ్ముతారు, అందులో సత్యయుగం **17, 28,000** సం॥ అని వారు చెబుతారు. భారతీయ పంచాంగ పద్ధతి వారు పాటిస్తారు, అధిక మాసం కూడా లెక్కిస్తారు. విద్యావిధానంలో భారతీయ గురుశిష్యపరంపర విధానం పాటిస్తారు. అగ్నిసాక్షిగా ఉపనయన సంస్కారం జరుపుతారు. జననం నుండి మరణం వరకు అన్ని సంస్కారాలను భారతీయులవలెనే జరుపుతారు. ఈ నాటికీ వారెంతో వేడుకగా రామలీల ఉత్సవం జరుపుతారు. ఇంకా సంస్కృతిలో రాజులు, అయరులు, ఉత్తర అమెరికా నుంచి వచ్చిన రాజదూత మైల్సుపాయిన్ డెక్స్టర్ ''ద అయర్ ఇంకాస్'' అనే పుస్తకం రచించాడు. ప్రాచీన రాజులు, ఆర్య అనే పదము భారతదేశం నుంచి ఇంకా లో ప్రవేశించాయని చెప్పారు. వీరు పోలీనీషియా దీపాలగుండా ఇంకా చేరారని భావిస్తున్నారు. ఇంకా ఆశ్చర్యమైన విషయమేమంటే ఇంకా భాషలో నౌకకు తమిళపదం కాటమగన్ ను ఉపయోగిస్తారు. పెరూ చివరి రాజు భారతీయుల వలె తురాయి అలంకరించిన తలపాగ ధరించేవాడు. స్పెయిను వారు వీరిపై దండెత్తివచ్చి ఈ రాజును హతమార్చినప్పుడు ఈ రాజు భార్యలు నలుగురు సతీసహగమనం చేశారు.

**పోలీనేషియా :** ఇది అసంఖ్యాక ద్వీప సముదాయం. ఇది పసిఫిక్ మహా సముద్రంలో ఉంది. ఇది ఉత్తర దక్షిణాలుగా **5000** మైళ్లు తూర్పు పడమరలుగా **3,600** మైళ్లు విస్తరించి ఉంది. ఈ ద్వీపాల మధ్య దూరం ఎక్కువగా ఉన్నప్పటికీ భిన్నమైన యాసలతో ఒకే భాష ఒప్పుతుంది. ఈలాగున ఏకత్వం సాధించిన ఘనత భారతదేశం నుండి ఇండోనేషియాదాటి ఈ ద్వీపాలు చేరిన భారతీయ ప్రచారకులకే దక్కుతుంది. కర్తవ్య దీక్షతో నిస్వార్థంగా సుదీర్ఘ కాలం చేసిన ప్రయత్నాల ఫలితంగా దీనిని వర్ణించవచ్చు. ఎన్సైక్లోపీడియా బ్రిటానికా (1957 XVI, P699) ఈ విధమైన ఏకత్వానికి భారతీయ సంస్కృతి కారణం అని వ్రాయబడింది. పోలినేషియా భాషలోని శబ్దాలకు సంస్కృత శబ్దాలకు సారూప్యం కనిపిస్తుంది. అనేక పదాల

ఉచ్చారణ వాటి అర్థాలు కూడా సంస్కృతాన్ని పోలి ఉన్నాయి. క్రీ.శ. 1836 లో తహతి ద్వీపవాసులకు ఆంగ్లేయులకు జరిగిన యుద్ధంలో తహతి ద్వీపవాసులు ఓడిపోయారు. అప్పటి సంధిపత్రంలో చేసిన తహతిరాజు సంతకం హరప్పా సంస్కృతి నాటి లిపిని పోలి ఉందని హెర్మన్‌లీచ తన పుస్తకం 'హిస్టరీ ఆఫ్ వరల్డ్ ఆర్ట్స్' పు 54 లో వ్రాశాడు.

'ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రెలిజియన్స్ అండ్ ఎథిక్స్' భాగం 7.2 లో రచయిత కింగ్ ఇలా వ్రాశాడు. పోలేనేషియన్ కథలలో వైదిక భావాలు కన్పిస్తాయి. స్వర్గం, నరకం, భూమి, ఆకాశం, ఈ లోకం, పరలోకం, వీటి మధ్య సంబంధాలు మొ॥ విషయాలలో భారతీయ సంస్కృతికి పోలికలున్నాయి. ఫోనేషియన్లు ప్రార్థనలు చదివితే వేదమంత్రాలు ప్రతిధ్వనిస్తున్నట్లు మనకు అనిపిస్తుంది. ఫోనేషియా ద్వీపాల మధ్య యుద్ధాలు జరిగేవి. అవి అచ్చం మహాభారత యుద్ధంలో లాగా నడిచేవి. శత్రువుకు సూచన చేసి యుద్ధం చేసేవారు. అలాగే ఆపేవారు. విశ్రాంతి సమయం లో పరస్పర స్నేహంతో కలిసేవారు. తమ ఇంటి ప్రక్కనుంచి వెళ్లే అపరిచతవ్యక్తిని ఆదరంతో పలకరించేవారు. అట్టివారికి ఆతిథ్యమిచ్చే స్వభావం వీరిలో కనిపిస్తుంది. అతిథి సత్కారాన్ని ఒక యజ్ఞంగా వీరు భావిస్తారు.

శిల్పకళలో వీరు పెరెన్నికగన్నారు. వీరి శిల్పాలలో భారతీయత కళ్లకు కట్టినట్లు కన్పిస్తుంది. నౌకా నిర్మాణంలో అత్యున్నత ప్రతిభ వీరిసొంతం. చాలామంది ద్వీపవాసులకు సొంత నౌకలుండేవి. ఆ నౌకలలోనే వీరు దూర ద్వీపాలకు సైతం ప్రయాణించేవారని హోర్నెల్ వ్రాశాడు.

ఐరోపావాసులు వివిధ ద్వీపాలు చేరి అక్కడి స్థానికులను పెద్దసంఖ్యలో హత్య చేశారు. ఆర్.సి. సగ్స్ మార్క్వేజా జాతీయులు పూర్వం ఒక లక్ష మంది ఉండేవారని ప్రస్తుతం వారు 3,000 మంది మాత్రమే ఉన్నారని వ్రాశారు.

భారతీయ సంస్కృతి ఛాయలు కలిగిన మయ ఇంకా సంస్కృతులు దాదాపు ఐదారువందల సం॥ వైభవోపేతంగా ఉన్నాయి. హరప్ప విషయంలో లాగా ఇక్కడి

సంస్కృతికి భారతీయ సంస్కృతికి సంబంధంలేదని చెప్పడానికి ఆంగ్లేయులు ఇతర ఐరోపావాసులు చాలా సంవత్సరాలు నానా తంటాలు పడ్డారు. భారతీయులకు నౌకాయానం గురించి ఏమీ తెలియదని ఆ శాస్త్రజ్ఞానం వారికి బొత్తిగా లేదని వారు ప్రచారం చేశారు. కాని అది అవాస్తవం.

కనీసం నాలుగువేల సంవత్సరాలకు పూర్వమే నౌకా నిర్మాణం లోను సముద్రయానం లోనూ భారతీయులు ఉత్తమోత్తమంగా నిలిచారు. న్యూయార్కులోని మ్యూజియం ఆఫ్ నేషనల్ హిస్టరీ డైరెక్టర్ డా॥ ఏఖోమ్ (Ekholm), రాబర్టు హియాన్‌గెల్డన్(Robert Heine Geldon) లు తూర్పు దక్షిణ ఆసియాలలో నౌకా నిర్మాణ శాస్త్రం అభివృద్ధిగాంచిందని వారు పసిఫిక్ మహా సముద్రాన్ని దాటగల సామర్థ్యాన్ని గలిగినవారని వ్రాశారు.

చైనా బౌద్ధపండితుడు పాహియాన్ క్రీ.శ. 5వ శతాబ్దంలో భారత్‌నుంచి చైనా తిరిగి వెళ్లేనౌకలో **200** మంది నావికులు, వ్యాపారులు ఉన్నారు. ఇది కొలంబసు ప్రయాణించిన నౌకకన్న నిశ్చయంగా పెద్దది. 'వాస్కోడిగామా' ఆఫ్రికాలో గుడ్ హోప్ అగ్రంనుంచి భారతదేశం చేరటానికి భారతీయ వ్యాపారులు మార్గం చూపించారని వారి నౌక వాస్కోడి గామా నౌకకన్న చాలా పెద్దదని వ్రాశాడు. మెక్సికోలోని ప్రభుత్వ చారిత్రకులు అమెరికాలో ముందు ప్రవేశించినవారు భారతీయులని వ్రాశారు. చిత్రమేమంటే అప్పటికి అమెరికాకు ఆపేరు లేదు. తరువాత ఆపేరు పెట్టారు.

భారతీయుల మనసులో సంస్కృతి ప్రచార వాంఛ ప్రబలంగా ఉంది. కనుకనే వాళ్లు స్వదేశంవదలి విదేశాలకు వెళ్లారు. భారతీయులనౌకా శాస్త్ర నైపుణ్యం గురించి సర్ జాన్ మాల్కొట్, 'జర్నల్ ఆఫ్ రాయల్ ఏషియాటిక్ సొసైటీ' వాల్యూమ్ 1లో ఇట్లా తెలియజేశారు. భారతీయ నౌకా శాస్త్రజ్ఞులు నౌకను ఏపనికైతే వినియోగిస్తారో ఆపని సక్రమంగా జరగటాని అనువుగా అందమైన నౌకలను నిర్మించేవారు. ఐరోపా నౌకా నిర్మాతలు నౌకా శాస్త్రనిపుణులు పారంగతులూ

అయినా భారతీయుల నైపుణ్యం ఐరోపావారిలో కనిపించదు అని వ్రాశారు. మైల్సుపోయిన్ డెక్స్టర్ తాను వ్రాసిన ''ద అయర్ ఇంకాస్'' అనే గ్రంథంలో భారతీయులు పాలినేషియన్ ద్వీపాల గుండా ప్రయాణం చేసి దక్షిణ అమెరికాను అతి ప్రాచీన కాలం లోనే చేరారని తెలియ జేశాడు. పెరూ దేశానికి ఈ ద్వీపాలకు మధ్యగల దూరం, భారత్‌కు పెరూకు మధ్యగల దూరంలో మూడింట ఒక వంతు ఉంటుంది. రెండువంతులు ప్రయాణం చేసిన వారికి ఒక వంతు ప్రయాణించటం కష్టం కాదు. పాలినేషియన్ ద్వీపాలలో భారతీయ సంస్కృతి ప్రభావం చాలా ఎక్కువగా ఉండేది.

నౌకావ్యవస్థ పూర్తిగా అభివృద్ధి చెందనప్పటికీ ఈ సముద్రప్రయాణాలు సాధ్యమేనని శ్యామలా మణి అయ్యర్ గారు ''ద హిందూ'' పత్రికలో వ్రాసిన **25-7-1998** తేదీనాటి ''ద హైసీస్'' అనే వ్యాసం సుస్పష్టం చేస్తుంది. ఆ వ్యాస సారాంశం ఈ క్రింది విధంగా ఉంది.

నార్వే దేశస్థుడైన థార్ హెయ్యర్‌ధల్, ప్రపంచంలోని దూరదూర ప్రదేశాలలోని అనేక పదాలు వాటి అర్థాలు సమానంగా ఉండటాన్ని గుర్తించారు. ప్రాచీన మానవుడు సముద్రమార్గం మీదుగా అన్నిప్రదేశాలు చేరుటయే దీనికి కారణమని నిర్ధారించారు. ప్రాచీన సంస్కృతులు తమ జన్మస్థానంనుండి అనేక ప్రాంతాలకు వ్యాపించడానికి సముద్ర ప్రవాహాలు గాలివాలులు వాహకాలుగా తోడ్పడ్డాయి. **1947** నుంచి **1981** వరకు కాన్ - టికి(kon - tiki) నుంచి టుకుమో (Tukumo) ఆయన చేసిన అనేక సాహసయాత్రలు, అన్వేషణలు వీటిని నిర్ధారించాయి.

మొదటి యాత్ర పెరూ దేశం లోని కాలో హార్బర్(Callow harbour) నుంచి కొన్ - టికి సాహసయాత్ర **28-4-1947** న మొదలయింది. రెండు అడుగుల వెడల్పు, **30**నుంచి **45** అడుగుల పొడవు కలిగిన బాల్సాదుంగలపై వెదురు గడలు పరచి దానిపై ఒక తుంగ గుడిసెను ఏర్పాటు చేసిన బల్లకట్టుపై వారు ప్రయాణం మొదలు పెట్టారు. **101** రోజుల కఠిన ప్రయాణం తర్వాత వారు పోలినేషియా

దేశంలో ట్యూమోటో దీవులలోని (Tumoto) రోరియా ఎటాల్ (raroria) ప్రాంతం సురక్షితంగా చేరారు. వారు ఈ విధంగా 4,300 మైళ్ల ప్రయాణం సాగించారు. ఆ చిన్న బల్లకట్టు ఈ విధమైన ప్రయాణానికి ఎంతో సురక్షితమైనదని ఈ సాహస యాత్ర నిరూపించింది. ప్రాచీన భారతీయులకు పెరూదేశం పోలినేషియన్ ద్వీపాలు పైన చెప్పినట్లుగా ప్రయాణించి చేరుకొనుటకు వీలుగా ఉన్నాయని ఋజువవుతుంది.

1978 లో హెయర్‌థల్ 'టైగ్రిస్' అనే బల్లకట్టు ప్రాచీన సుమేరియన్ పద్ధతులతో తయారుచేశాడు. దానిమీదే ఆయన ఎర్ర సముద్ర ముఖద్వారం లో ఉన్న డిజిబౌటి (Digibouti) నుంచి 7,000 కి.మీ. ప్రయాణం సాగించారు.

ఈ ఆధారాల కారణంగా భారతీయులు సముద్రమార్గం గుండా అమెరికా చేరడం కష్టంకాదని తెలుస్తోంది. ఆ విధంగా భారతీయులు అమెరికా చేరారు. వారి ప్రభావంతో మయ 'ఇంకా' సంస్కృతులు ఐదారువందల సం॥ వైభవోపేతంగా కొనసాగాయి.

సముద్రమార్గం ద్వారా మెక్సికో చేరిన భారతీయులు అక్కడి నుండి భూమార్గం గుండా ఉత్తర అమెరికా కెనడా చేరారు. ఉత్తర అమెరికా చేరడానికి వారికి సముద్ర భూమార్గాలు రెండూ ఉపయోగపడ్డాయి. ఈ విధమైన పరిజ్ఞానం ఉన్నకారణాన భారతీయులు ఈ మార్గాలనన్నిటినీ ఉపయోగించేవారు.

ప్రపంచ పటాలు రెండు విధాలైనవి మనకు అందుబాటులో ఉన్నాయి. మొదటిది గోళాకారంగా వ్రాసిన చిత్రం. రెండవది చదునైన కాగితం మీద వ్రాసింది. ఈ రెండవ చిత్రంలో అమెరికాను ఎడమవైపు చూపిస్తారు. ఇది ఐరోపావాసులకు సముద్ర ప్రయాణంలో ఉపయోగపడింది. దీని ప్రకారం అమెరికాకు జలమార్గం మాత్రమే మేలు అనిపిస్తుంది. ఈ అభిప్రాయం చాలామందిలో ఉంది. కాని ఐరోపా విస్తరణ కన్న ముందే భారతీయులు అమెరికాచేరారు. అదిన్నీ భూమార్గంలో చేరారు. అలా జరిగిందని అమెరికనులతో వారికి గల పరిచయం స్పష్టం చేస్తుంది.

ఈ క్రింద రెండు ప్రపంచపటాలున్నాయి.





మొదటిది సముద్రమార్గం ఆధారంగా ఐరోపావాసులు గీసింది. రెండవది ప్రపంచంలోని భూమిని ఏకరూపంగా చూపింది. మానవుని జీవనానికి నివాసానికి ఆధారమైనది భూమి. ఆమానవుడు సహించగల ఉష్ణోగ్రతలు భూమిమీద ఉత్తర దక్షిణ ధ్రువాల వద్దలేవు. అక్కడ నీరు గడ్డకట్టి ఉంటుంది. రష్యాలోని సైబీరియా ఉత్తర అమెరికాలోని అలాస్కాల మధ్య 200 కి.మీ. వెడల్పున బేరింగు జలసంధి ఉంది. ఇది సంవత్సరంలో ఎక్కువకాలం మంచుతో కప్పబడి ఉంటుంది. ఆ కాలంలో ఇది భూమార్గంగా ఉపయోగిస్తుంది. ఇదే భారతీయులు ప్రయాణించిన అమెరికా భూమార్గం.

అమెరికా చేరిన ఐరోపావాసులు మయ ఇంకా తెగలను నాశనం చేసినట్లుగానే అమెరికాలోని రెడ్ ఇండియన్ తెగలను నాశనం చేశారు. ఈ రెడ్ ఇండియన్ తెగలు నివసించే ప్రాంతాలు అమెరికాలో ఇప్పటికీ కనిపిస్తాయి. అహమ్మదాబాదుకు చెందిన సంస్కృత పండితుడు పురావస్తు శాస్త్రవేత్త డా.కే.కే. శాస్త్రి 12 13 సం.కు ముందు రెడ్ ఇండియను భాషపై పరిశోధన చేశారు. వారు రెడ్ ఇండియను భాషలో గల సంస్కృత పదాలను గుర్తించారు. వారి ఉచ్చారణ కూడా సంస్కృత ప్రభావం కారణంగా స్వచ్ఛంగా ఉంటుంది.

గుహలలోని వర్ణచిత్రాలపై పరిశోధనలు గావించిన పురావస్తు తత్వ శాస్త్రవేత్త వా. శ్రీ వాకణకర్ ఉపన్యాసం ఇవ్వడానికి అమెరికా వెళ్లారు. అక్కడ వాకణ్కర్ కోరికపై రెడ్ ఇండియన్లతో వారిని సమావేశపరచారు. పరిచయ సమయంలో రెడ్ ఇండియను పేరును శ్రీ వాకణ్కర్ స్పష్టంగా ఉచ్చరించారు. ఆలాగున ఐరోపావాసులు పలకలేరు. తనపేరును ఇంత స్పష్టంగా ఉచ్చరించిన మొట్ట మొదటి విదేశీయుడు వాణకర్ అని రెడ్ ఇండియన్ చెప్పాడు. వాకణకర్ రెడ్ ఇండియను పూజా పద్ధతి చూడగోరాడు. ఇతరులను తమపూజా స్థలానికి అనుమంతించము అని అతడు బదులిచ్చాడు. ఇది ఐరోపావాసుల దుశ్చర్యల ఫలితం. కాని వాకణకర్ రెడ్ ఇండియను పెద్దలతో సంప్రదింపులు జరిపాడు. ఎట్టకేలకు వారి పూజా పద్ధతిని

చూసేందుకు అనుమతి సంపాదించాడు. అదో కమనీయదృశ్యం. అక్కడో యజ్ఞకుండం. ఇద్దరు ముగ్గురు దాని చుట్టూ కూర్చున్నారు. యజ్ఞం సాగుతోంది. ఆహుతి సమర్పించే వేళ ''హు ఆ'' ''హు ఆ'' అంటున్నారు. అది భారతీయులు చెప్పే స్వాహా మంత్రోచ్చారణ. ఇదంతా రెడ్ ఇండియానులకు భారతీయులకు గల బాంధవ్యాన్ని స్పష్టం చేస్తుంది.

## ఆస్ట్రేలియా

క్రీ.శ. 17వ శ.లో ఐరోపా నివాసి కెప్టెన్ కుక్ ఆస్ట్రేలియా చేరినట్లు చెప్పుకొన్నాం. ఈ దేశపు ప్రాచీన చరిత్ర గురించిన ఆధారాలు మనకు చాలా తక్కువ కనిపిస్తాయి.



నాట్య శాస్త్ర ప్రవీణురాలైన డా. పద్మాసుబ్రహ్మణ్యం నాట్య ప్రదర్శనార్థం కొద్ది సంవత్సరాలక్రితం ఆస్ట్రేలియా వెళ్లారు. వెళ్లేముందు ఆమె తమ గురువుగారైన కంచి పరమాచార్య చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురు శంకరాచార్యులను ఆశీస్సులందు కొనడానికి దర్శించారు. అప్పుడు జగద్గురువులు ఆస్ట్రేలియాలో శివభక్తుల తండాలున్నాయని వారు చేతులపై శరీరంపై విభూతిరేఖలు ధరిస్తారని వారిని కలిసి రమ్మని చెప్పారు. కాని ఆమెకు ఆస్ట్రేలియాలో నృత్యోత్సవాలలో ప్రదర్శనలను ఇచ్చేందుకు కొద్దిరోజులు మాత్రమే ఉండే అవకాశం ఉంటుంది. ఈ శివ భక్తుల తండాలను కలుసుకొనే వీలెట్లా కలుగుతుందనే సందేహం కలిగింది. ఆశ్చర్యమేమంటే ఆ ఉత్సవంలో ప్రదర్శన ఇచ్చేందుకు శివభక్త తండాల నుండి ఒక బృందం వచ్చింది. ఆమె వారిని కలుసుకొనే అవకాశం కలిగింది. ఆ తండా పేరు గగుజ్జ. వారు అక్కడి ''బాలగో'' పర్వతాలపై నివసిస్తున్నారు. వారిభాష తమిళాన్ని పోలి ఉంది. శ్రీమతి పద్మ వారితో మాట్లాడిన అతికొద్ది సమయంలోనే 40 తమిళపదాలను ఆ శివభక్త తండా భాషలో గుర్తించగలిగారు. తమిళ గాయకులు పాడే హంసనంది రాగంలో ఆ శివభక్తులు పాడారు. పాటలో వాక్యాలు రావంరావం పదాలతో ప్రారంభమయ్యాయి. ఇదంతా పది సం. క్రితం డా. పద్మాసుబ్రహ్మణ్యం ఆస్ట్రేలియా అనుభవం.

ఆస్ట్రేలియాలోని ఈ ఆదివాసుల భాషా సంస్కృతులకు తమిళ భాషా సంస్కృతులకు అవినాభావ సంబంధం ఉందని డా. పద్మాసుబ్రహ్మణ్యం పత్రికల వారితో చెప్పినపుడు ఈ వార్త సంచలన వార్త అయి కూర్చుంది. కాని అక్కడి మనుష్య వర్ణన శాస్త్ర పండితుడు ప్రొ. బెర్టాంట్ దీనిని వ్యతిరేకించారు. ఆస్ట్రేలియా శ్వేత జాతీయులైన ఐరోపావాసులదని ఆయన వాదన. ఆస్ట్రేలియా స్థానికులైన ఆదివాసులదని చారిత్రకాధారాలనుబట్టి ప్రపంచంలోని ఇతరదేశాల వారు గుర్తించటం ఆ తెల్లవారికి ఇష్టంలేదు. స్థానికులలో ఆస్ట్రేలియా తమదే అనే జాగృతి కలగటం వారికి మింగుడు పడటం లేదు. ఈ విషయాలన్నీ డా. పద్మాసుబ్రహ్మణ్యం వ్రాసిన ''కంచి మహాస్వామీస్ విజన్ ఆఫ్ ఏషియన్ కల్చర్''లో 11వ పుటలో

ఉన్నాయి.

ఐరోపా విస్తరణ వాద సమర్థకులు ఒప్పుకొన్నా ఒప్పకోకపోయినా భారతీయ తమిళులు అతిప్రాచీన కాలం నుంచి ఆస్ట్రేలియాలో ఉన్నారు. వారికి గగుజ్జ జాతితో సంబంధ బాంధవ్యాలున్నాయి. ఈ సత్యం కొట్టిపారేసినా పోయేది కాదు. ఐరోపా విస్తరణకు పూర్వమే నిజమైన ఆధారాలతో ప్రపంచంలోని అయిదు ఖండాలకు భారతీయుల సాంగత్యం ఏర్పడింది అనేది స్పష్టం. ఇది సుస్పష్టం.

వర్తమాన కాలంలో క్రీ.శ. 20వ శతాబ్దంలో కూడా మానవధర్మప్రచారానికి సంపూర్ణ మానవజాతితో సాంగత్యం ఏర్పడడానికి భారతీయులు నిరంతరం కృషి చేస్తూనే ఉన్నారు. రామకృష్ణ ఆశ్రమం, మహేశ్‌యోగి ట్రాన్సెడెంటల్ సెంటర్, ఇస్కాన్, రాష్ట్రీయ స్వయం సేవక సంఘ మొ॥ అనేక సంస్థలు ప్రపంచంలోని అయిదు ఖండాలలో ఈ కార్యక్రమాలు విస్తరింపజేశాయి. చేస్తున్నాయి. ఈ ఆధునిక ప్రపంచంలో కూడా భారతీయ సంస్కృతి విస్తరణ గురించిన వివరణ అవసరంలేదు. వర్తమాన కాలానికి సంబంధించినది ఇది, అందరికీ తెలిసినది కాబట్టి పైన పేర్కొన్న సంస్థల సంస్కృతి విస్తరణ గురించిన వివరణ ఈయవలసిన పనిలేదు.

గత 4000 సం.లుగా మానవజాతికి భారతీయ సంస్కృతి అందించే ప్రక్రియ ప్రచారం నిరంతరంగా సాగుతూ వస్తున్నది. సృష్టిహితం, మానవహితమే తమ ధ్యేయంగా భావించిన అనేకులు, ప్రచారం నిమిత్తం తమ జీవితాలను త్యాగం చేస్తున్నారు. ప్రపంచంలోని అనేకదేశాలలో దీర్ఘకాలం నివాసం ఏర్పరచుకొన్నప్పటికి స్థానికులకు భారతీయ ప్రచారకుల మీద ఈర్ష్యా ద్వేషాలు కలుగలేదు. సరికదా ప్రేమ గౌరవ మర్యాదలను భారతీయులు పొందగలిగారు. దీనికి కారణం? స్థానికుల సుఖదు:ఖాలలో భారతీయులు పాలుపంచుకోవడమే. భారతీయులు స్థానికులకు లాభం కలిగించారేగాని నష్టం కలుగజేయలేదు.

## వ్యక్తి నిష్ఠా పరిణామం

పైన చెప్పిన భారతీయ ప్రచారకులకు విరుద్ధంగా ఐరోపా విస్తరణ సాగింది.

వీరి విస్తరణ పర్వంలో భౌతికమైన సంపదను పెంపొందించుకోవడానికి వ్యక్తిగత స్వార్థపూరణకు ప్రపంచదేశాలలో వీరు అడుగుమోపారు. అక్కడి స్థానికులకు నష్టం కలిగించారు. పోలినేషియాలోని చిన్నిచిన్ని ద్వీపాలను వీరు ఆక్రమించారు. వీరు అక్కడి స్థానికులకు ఎంతో నష్టం కలిగించారు. భోగలాలసత, స్వార్థప్రయోజనాలకు ప్రాధాన్యం ఇచ్చేవీరు ఇతరుల సుఖదు:ఖాల గురించి పట్టించుకోలేదు. మానవ సమాజంలోని ప్రకృతి సంతులనానికి నష్టం గావిస్తూ తమ స్వార్థ ప్రయోజనాలను ఆశించే వారి మన:స్థితి ఐరోపా విస్తరణ నాడెట్లా ఉందో నేటికీ అట్లాగే ఉంది. యాత్రలు జ్ఞానాన్ని పెంపొందిస్తాయని భారతీయుల కథనం. కాని నాలుగైదు వందల సంవత్సరాల ప్రపంచ పర్యటనానంతరం కూడా ఐరోపా వారి మన:స్థితి మానవహితం కోరేదిగా మారలేదు.

భూమిని చుట్టి ఉన్న వాయుమండలం ఓజోన్ పొర సర్వ జీవజాల సంరక్షణకు అత్యంత ఆవశ్యకమైనది. అది ప్రస్తుతం క్షీణించిపోతోంది. చిల్లులు పడుతోంది. గాలిలో బొగ్గుపులుసు వాయువు (కార్బన్ డయాక్సైడు) తగు పరిమాణంలో ఉండాలి. కాని ఇది రోజూ పెరిగిపోతోంది. భోగ కేంద్రమైన పాశ్చాత్య మనస్తత్వం ప్రపంచంలో పెరిగిపోతున్నది. పాశ్చాత్య జీవన విధానాలను అందరూ అనుకరిస్తున్నారు. సంపన్న పాశ్చాత్య దేశాలైన అమెరికా మొ॥ విదేశాలు వాతావరణ కాలుష్యం అధికం కావడానికి కారణమవుతున్నాయి. ప్రపంచ దేశాల పర్యావరణ పరిరక్షణ సమ్మేళనంలో కాలుష్య వాతావరణానికి తమ వంతు పాత్ర అధికమని అంగీకరించాయి. అందుకు గాను వారి దేశంలో కొన్ని ఆంక్షలు కూడా ప్రవేశపెట్టవలసి ఉంది. అందుకు ఆ దేశాలు అంగీకరించాయి. ఐదు సంవత్సరాల తరువాత క్రిందటి సంవత్సరం జరిగిన పర్యావరణ పరిరక్షణ సదస్సులో అమెరికాలాంటి పెద్ద దేశాలు తాము పాటించవలసిన ఆంక్షలు పాటించడం లేదని వెల్లడైంది. ఆ కారణాలచేత వాతావరణకాలుష్యం ఎక్కువైంది. వారు కాలుష్య కారక వస్తువుల్ని నిషేధించడానికి సిద్ధంగా లేరు. సృష్టి నశిస్తేనేం మాకు సుఖాలు కావాలి అనే మనస్తత్వం వ్యవహారం వారిలో ఇంకా మారలేదు. ఐరోపా విస్తరణ సమయంలో

వీరి సాంగత్యం ఏర్పడిన దేశాలవారు భోగవాదులుగాను వ్యక్తి నిష్ఠా పరులుగానూ మారుతున్నారు. నిరంతర పరిణామం చెందే ఈ సృష్టి సమతౌల్యం కోల్పోయి ప్రళయంవైపు పరుగులు తీస్తోంది.

## మానవ ధర్మ ఫలితం

ఐరోపా వారి స్వార్ధానికి భోగలాలసతకూ వ్యతిరేకంగా త్యాగం, నియమబద్ధ భోగాలు, సంపూర్ణ సృష్టిలో సుఖశాంతులు పొంగిపొరలటానికి ఏర్పరచబడిన జీవన ధ్యేయాలు భారత దేశంలో అతి ప్రాచీన కాలం నుండి భారతీయులకు పరంపరగా అందుతున్నాయి. ప్రాచీన కాలంలోనే భారతీయ ఋషులు, మునులు పరమేశ్వర నిర్మితమైన ఈ సంపూర్ణ సృష్టిని మూడు భాగాలుగా గుర్తించారు. వ్యష్టి, సమిష్టి, శేషసృష్టి. వ్యష్టి అనగా వ్యక్తిగా మానవుడు భావిస్తాడు. సమిష్టి అనగా పూర్తి మానవ సమాజం. శేషసృష్టి అనగా మానవేతర ప్రాణులు. సంపూర్ణ సృష్టి అనగా మానవులు మానవేతర ప్రాణులు. ఇందులో మానవులకు సృష్టిలోని మిగతా ప్రాణుల కన్న బుద్ధి, విచక్షణా జ్ఞానము మొ. విశేష గుణములను పరమేశ్వరుడు ప్రసాదించాడు. అందుకే భారతీయులు మానవునకు ఇంత ప్రాముఖ్యం ఇస్తారు. మానవునకున్న ఈ విశేష గుణాలలో అతడు సృష్టి సమతౌల్యాన్ని కాపాడగలడు లేదా సృష్టి వినాశనానికి కారకుడు కాగలడు. భారతీయ దృక్పథంలో సంపూర్ణ సృష్టి సమతౌల్యాన్ని ఎలాగ కాపాడవలెనో సూచిస్తున్న ఈ చిన్న శ్లోకం ఈ గ్రంథ సారాన్ని అందిస్తుంది.

త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్ ।
గ్రామం జనపద స్యార్థే ఆత్మార్థే పృథ్వీం త్యజేత్ ॥

**భావం :** అవసరం కలిగినప్పుడు ప్రతివ్యక్తి సొంతపని మానుకొని పరివారం గురించి ముందుకు సాగాలి. అలాగే గ్రామం కోసం తన పరివారాన్ని వదలాలి. ప్రాంతంకోసం

గ్రామాన్ని వదలాలి. చివరగా మోక్షం కోసం ఈ భూమిపై మోహం వదలాలి. ఈ మౌలిక లక్షణాలు ప్రతి భారతీయునిలోను ఇతరులకు సేవ చేయడానికి పరహితం కోరుకొనడానికి ఉపయోగించాయి. ఇట్టి మంచి భావనలను మానవులలో పెంపొందించాయి. నేను కాక ఈ సృష్టిలో ఉన్నవేమిటి? వాటినుంచి నాకున్న లాభం ఏమిటి వాటి మీద నాకున్న అధికారం ఏమిటి? అని భారతీయులు ఆలోచించలేదు. సృష్టిలోని ఇతరులపట్ల మనకర్తవ్యం ఏమిటి అని భారతీయులు ఆలోచిస్తారు. ఆ కర్తవ్యం పూర్తి చేయడానికి సదా సంసిద్ధులై ఉంటారు. ఈ విధమైన శిక్షణ భారతీయులకు ఉంది. ఇతరుల విషయంలో ఏ వ్యక్తి తనకున్న బాధ్యతలకు ప్రాముఖ్యత నిచ్చి కర్తవ్యం నెరవేర్చడానికి అడుగులు ముందు వేస్తాడో ఆ వ్యక్తులున్న కుటుంబం, ఆ కుటుంబాలున్న సమాజం సుఖశాంతులతో ఉంటాయి. ఇందుకు విరుద్ధంగా నాకున్న హక్కులేమిటి? అధికారాలేమిటి? వాటిని నేనెలా నాకోసం సాధించుకోవాలి అనే ఆలోచనలున్న వ్యక్తుల కారణంగా కుటుంబం, కుటుంబాల కారణంగా సమాజం శాంతిని కోల్పోతాయి. సృష్టి తన సమతౌల్యాన్ని కోల్పోతుంది.

మనిషి ప్రశాంతంగా జీవించడానికి ఏంకావాలి? తినడానికి ఇంత తిండి, కట్టుకోవడానికి ఇంత గుడ్డ, ఉండడానికి ఇంత గూడు. వీటితో ప్రశాంతంగా మనిషి బ్రతికే పరిస్థితులు ఉన్నప్పుడు ఇతర వ్యక్తులను మొత్తం సమాజాన్ని పీడించాలనే ఆలోచన కలుగదు. భారతదేశం విశిష్టత ఏమిటి? ఒకవైపు ఉన్నతమైన హిమాలయాలు మూడువైపులా సముద్రంతో సురక్షిత ప్రాంతం! సారవంతమైన భూమి! ఇవి భారతీయుని భౌతిక విషయాలను గురించి ఆలోచించే అవసరం నుంచి తప్పించాయి. అంతేకాదు, భారతదేశ ప్రకృతి సౌందర్యం మన ప్రాచీనులను జిజ్ఞాసువులను చేసింది. సృష్టి సమతౌల్యం కోసం ప్రతి మనిషి ఎలాగున ఆలోచించాలి? ఆ ఆలోచన సరళి పొందటానికి కావలసిన సంస్కారం ప్రతిమనిషికి ఎలా అందించాలి? అనే విషయాలను భారతీయులు నిర్ధారణ చేయగలిగారు.

అలాంటి సంస్కారం కలిగిన వ్యక్తి నిష్క్రియంగా పడి ఉంటాడా? సంపూర్ణ మానవ సమాజానికి అలాంటి సంస్కారాన్ని అందించే ప్రయత్నం చేస్తాడు. అలాగున ప్రేరణ కలిగిన భారతీయులు మొత్తం ప్రపంచాన్ని ఆర్యులుగా (ఉత్తములుగా) చేసే ఉద్యమంలో ప్రపంచ పర్యటన చేశారు, చేస్తున్నారు, చేస్తారు. భారతీయులు నిరంతరంగా సమాజంలో మానవునకు ఉన్న కర్తవ్యం అనగా మానవధర్మం గురించి తెలియ జేస్తూనే ఉన్నారు. సమస్తప్రాణి కోటిలో అధిక బుద్ధిజీవుడైన మానవునకు ఈ చరాచర సృష్టిలోని సమతౌల్యాన్ని కాపాడే బాధ్యతను ఆ భగవంతుడు అప్పగించాడని భారతీయులు విశ్వసిస్తారు.

గడచిన రెండు రెండున్నరవేల సంవత్సరాలుగా భారతీయులపై జరిగిన నిరంతర దురాక్రమణ ఫలితంగా ఈ మహాకార్యక్రమం శిథిలమై పోయింది. విజ్ఞానంలోను నాగరికతలోను ఎంతో ఎదిగిపోయామని ప్రగల్భాలు పలుకుతున్న ఈ రోజులలో ఈ మానవధర్మ ప్రచార ఆవశ్యకత ఇంత అని చెప్పటానికి వీలులేదు. మానవధర్మం మాత్రమే సంపూర్ణ మానవ సమాజానికి సుఖశాంతులందించగలదు. సమస్త సృష్టి సమతౌల్యాన్ని కాపాడగలదు. సర్వప్రపంచానికి మానవధర్మమే శ్రీరామరక్ష.




అస్ట్రేలియాలో 'బాల్‌గో' కొండలలో నివశిస్తున్న 'గగుజ్జ' శైవతాండా.

# అనుబంధము

(8 పేజి చివరిపేరాగా చదవాలి) మూడు నాలుగు వేల సం॥ పూర్వము. వెలుగొందిన నాగరికతలను పాశ్చాత్య చరిత్రకారులు. "ప్రాచీన నాగరికతలు" గా గుర్తిస్తారు. ఇలా గుర్తించబడిన నాగరికతలు ఎక్కువగా. ఆసియా ఖండములో విస్తరించి ఉన్నాయి. మిగిలిన నాగరికతలు పశ్చిమ ఆసియాతో కలసి ఉన్న ఐరోపా ఆఫ్రికా ఖండాలలోని కొద్ది ప్రదేశాలలో మాత్రం విస్తరించి ఉండేవి. పశ్చిమాన ఐరోపాలోని గ్రీసు (యూనాన్), రోమ్ నాగరికతలు, ఈ జిరాప్ట్ (మిశ్రా) నాగరికత, తూర్పున చైనా నాగరికత, మధ్యభాగములో భారతీయ నాగరికత వెల్లివిరిశాయి.

ప్రస్తుత అద్యాయములో చెప్పబడిన సుమీరియా, బాబిలోనియా అస్సీరియా నాగరికతలు దాదాపుగా ఒకే ప్రదేశానికి చెందినవి. ఆ ప్రదేశము ఇరాన్ సముద్రము మధ్యదరా, కాస్పియన్ సముద్రాల మధ్యప్రదేశము, మరియు ఇరాన్‌కు పశ్చిమాన ఉన్న ప్రాంతము. ఇరాక్, సిరియా, లెబనాన్, ఇజ్రాయిల్, జొర్డాన్, మరియు టర్కీలోని, కొంతబాగము, ఈ మూడు సముద్రాల మధ్య ప్రాంతము లోకి వస్తాయి. క్రీ॥ పూ॥ 2150 సం॥ నాటికి సుమేరియా నాగరికత నశించిపోయినది. తరువాత బాబిలోనియా నాగరికత ప్రారంభమైనది. బాబిలోనియా నాగరికత అంతరించే సమయములో అస్సీరియా నాగరికత ప్రభవించింది ఈజిప్టు (మిశ్ర), రోమ్, గ్రీసు (యునాన్) ఇరాన్, చైనా, నాగరికతలు నేటికీ ఆయాదేశాలలో కనిపిస్తాయి. పశ్చిమ చైనా ప్రాంతాలలోను చైనా కాస్పియన్ సముద్రమధ్య ప్రాంతములోను గల రష్యా దక్షిణ ప్రాంతములో హూణనాగరికత వెలసినది. హూణనాగరికత అంతరించిన సమయం కన్న కొన్ని శతాబ్దాల పూర్వమే కాస్పియన్ తూర్పు తీరములో కాశ్యపనాగరికత వెలసినది.

(14 పేజి చివరి పేరాగా చదవాలి) ఐరోపాలో పెరొందిన మూడు నాలుగు నాగరికతలలో గ్రీకు రోమన్, నాగరికతలు. ప్రముఖంగా పేర్కొన బడినవి. ఈ రెండు నాగరికతలుకూడా దాదాపుగా 13,14, వందల సం॥ ప్రాచుర్యములో ఉన్నాయి గ్రీసు నాగరికత పుట్టిన పిదప రొమన్ నాగరికతపుట్టినది. గ్రీసు నాగరికత నశించిన కొంత కాలానికి రొమన్ నాగరికత నశించినది. రొమను నాగరికత నశించిన . ఒక వేయి సం॥ తరువాత మాత్రమే. ఈనాడు పాశ్చాత్యులుగా పిలవబడుతున్న ఐరోపా రాష్ట్రాలు వెలిశాయి. ఈ దేశాల నాగరికత గ్రీసు, రోము, నాగరికతల ఆధారముగా ఏర్పడినప్పటికి, ప్రత్యేక నాగరికతగా ఉన్నాయి. వీరు వ్యక్తిపరమైన భోగలాలసతకలిగి యున్నారు. ఇది పాశ్చాత్య నాగరికతగా గుర్తింపు పొందినది. ఐరోపా వాసులు సైనిక బలంతో

స్వాధీనము చేసుకున్న అమెరికా ఆస్ట్రేలియా దేశాల నాగరికతలు కూడా పాశ్చాత్య నాగరికతగా చెప్పుతున్నారు. ఈ రెండు ఖండాల చరిత్ర 3,4, వందల సం॥ రాలదిమాత్రమే. ప్రస్తుతం ఐరోపా దేశాలు. తమ చరిత్ర 7,8, వందల సం॥ కన్నా ఎక్కువనీ చెప్ప లేరు.

ఐరొపావారు. 4,5, వందల సం॥లో పెద్ద పెద్ద సామ్రాజ్యాలు నెలకొల్పారు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్పెయిన్, పోర్చుగల్, హాలెండ్ దేశాలు తమ సామ్రాజ్యాలను ప్రపంచమంతా స్థాపించారు. ఆసామ్రాజ్యాలు ఇప్పుడు నశించాయి. ఇది అంతా తమగొప్ప తనమని చెప్పుకుంటారు. ఇం షు వారు తమ సామ్రాజ్యంలో సూర్యుడు అస్తమించడని గర్వంగా చాటుకున్నారు. బుద్ధి చాతుర్యము, కార్యదీక్ష, మొదలగు గుణాలు తమలో ఉండబట్టే తమ సామ్రాజ్యవిస్తరణ జరిగిందనీ, మిగతావారు ఓడిపోయారని ఐరోపావాసుల అభిప్రాయం. అందుకే వారు తమను తాము ఆర్యులని చెప్పుకొని. ఇతరులను అనార్యులు (తక్కువబుద్ధి కలవారు) అన్నారు.

ఈ "ఆర్య" పదం సంస్కృతం నుంచి. తీసుకున్నారు. సంస్కృతంలో ఆర్యా అంటే "గొప్పతనం" కలవారు అని అర్థం. ఇవి అన్ని అహంకారముతో చేసిన ఐరోపావారి కల్పిత కధలు. ఈ విషయం అందరికి అర్థమైంది.

సామ్రాజ్యాలు స్థాపించిన ఐరొపావాసులు, విజయోన్మాదంలో అనేక విషయాలను తప్పుడు ప్రచారం చేసారు. తమ గొప్పతనం చాటుకునే ప్రయత్నములో వారు తమ నాగరికత అతి ప్రాచీన మైనదని, భారతీయులు అనేక శాస్త్రవిషయాలు, నాగరికత, ఐరోపా నాగరికతనుంచి గ్రహించారని చెప్పారు. భారతీయులకు తమ దైన శాస్త్రసంపద నాగరికత లేవని చెప్పటం వారి ఉద్దేశం.

(32 పేజి చివరి పేరాగా చదవాలి) 14.10.1492 కొలంబస్ అమెరికా చేరాడు. తరువాత అనేకమంది స్పెయిన్ వారు చేరారు. 1519లో స్పెయిన్ రాజు తన సేనాని హెర్నర్ కెర్డును. గుర్రపుసైన్యంతో పంపించినారు. హెర్నర్ రాజుకి రాసిన లేఖలో "మాయా తెగలోని ప్రతి వ్యక్తి బంగారు, వెండి, రత్నాలు, మొదలగు విలువైన ఆభరణాలు ధరించి ఉన్నారని. అక్కడి బజారులలో అన్ని రకములైన వస్తువులు లభ్యమవుతూన్నాయని, ఏ విషయములోను కొరతలేదని". వ్రాసినాడు. అక్కడి ముఖ్యమైన రెండు పట్టణాలు "టెనోక్టిట్లాన్" "ట్లాటే లోస్కో" అని కూడా వ్రాసినారు. 1521లో స్పెయిన్ వారు ఈ పట్టణాల పైనదాడిచేసి అక్కడ మెక్సికో రాజ్యాన్ని స్థాపించినారు. "మాయా" తెగవారిని క్రైస్తవులుగా బలవంతముగా మార్చారు. అనేక మందిని చంపేశారు అనేక మంది తిండిలేక మరణించారు, "ఫాదర్ లాకోసాన్" ఐరొపా వాసులు 40, లక్షల మంది "మాయా" తెగవారిని నాశనము చేసిసంరని వ్రాశారు.

# భారతీయ సంస్కృతీ ప్రచార సమితి

వ్యక్తి తన స్వార్థాన్నీ, స్వీయానందాన్నీ కొంతైనా వదలుకొని, యితరులు కష్టాలలో ఉన్నప్పుడు సహాయపడాలి. తన సేవను కుటుంబంలోని సభ్యులనుండి, గ్రామానికి, దేశానికి, మానవత్వానికి, విశ్వానికి అందజేయాలి. ప్రాచీన భారతీయుల అభిప్రాయం ప్రకారం, అటువంటి వ్యక్తులు ఎక్కువమంది ఉన్న సమాజం సమస్త సంపదలతో తులతూగుతూ ఆనందమయమై సంతృప్తి కరమైన జీవనాన్ని కొనసాగిస్తుంది. భారతీయ సమాజంలో అటువంటి వ్యక్తులు ఉన్నందున, భారత దేశం ఎన్నో వేల సంవత్సరాలుగా సుఖమయమైన జీవనాన్ని తృప్తిగా కొనసాగించింది. ఐరోపాలో 15వ శతాబ్దపు పునరుజ్జీవనోద్యమం తరువాత తాము ఊహించుకున్న లౌకికవాదం ఆధారంగా సామాజిక జీవనాన్ని రూపొందించు న్నారు. అందువలన భౌతిక, వైయక్తికవాదులై పోయారు. వారి సమాజాలు కొన్ని వందల సంవత్సరాలలోనే కూలిపోయాయి. విడాకులు పెరిగి పోయాయి. కుటుంబాలు ధ్వంసమై పోతున్నాయి. అనాథలైన పిల్లలు తల్లిదండ్రుల ప్రేమకు కరువై, సమాజాన్ని అనేక యిబ్బందులకు గురిచేస్తున్నారు. ఐరోపావారి సామ్రాజ్యంతోపాటు, వారి భౌతిక దృష్టికూడా ప్రపంచమంతా వ్యాప్తి చెందింది. అది వ్యాప్తి చెందిన చోటల్లా దాని దుష్ప్రభావం కనపడుతూనే ఉంది.

ప్రపంచానికి యిది ఒక సాంస్కృతిక విపత్తు. కొన్ని వేల సంవత్సరాలుగా చైతన్యవంతమైన సామాజిక జీవనాన్ని కొనసాగించిన అనుభవంతో భారతీయులు తమ దృక్పథాన్ని ప్రపంచమంతటా చాటాలి. ప్రపంచాన్ని ఆదుకోవాలి.

భారతీయ సంస్కృతీ పచార సమితి
ఫ్లాట్ నెం. 3, నిర్మిత్ నికేతన్ అపార్ట్‌మెంట్స్
3-4-12, కాచిగూడ, హైదరాబాద్ - 500 027